శ్రీరస్తు.

# సత్యవిజయము.

అను

## నామాంతరముగలశుద్ధాంధ్రనిర్వచనహరిశ్చంద్రోపాఖ్యానము

---

ఇది


కులాలకులుండును, ఆంగ్లేయభైషజ్యకర్మచాతురీధురీణుండును,

ప్రస్తుతము అనంతపుర మండలములోని పెనుగొండ

పురనివాసియునగు,

అయ్యనకోట పార్థసారథి శ్రేష్ఠి

విరచితము.


---

మొదటికూర్పు

---


బళ్ళారి డి. వి. క్రిష్ణన్ అండుకంపెనివారి

రమావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడియె.

**1897.**

దీనివెల రూ ౧—౦—౦ అంచెకూలి ౦—౨.

# OPINIONS OF THE PRESS

## AND

## PUNDITS.

---

## శ్రీ సత్యవిజయకృతివిమర్శనము.

—✳ శ్రీ యాంధ్రభాషా సంజీవని. ✳—

---

చెన్నపురి — హేవిళంబి నామ సం॥ జ్యేష్ఠమాసము.

సత్యవిజయము — ఇదియొకయచ్చతెలుఁగుపద్యకావ్యము. ఇద్ది, అనంతపుర మండలములోని పెనుగొండలోనుండెడు, మ॥రా॥రా॥శ్రీ, అయ్యనకోట. పార్థసారధిసెట్టిగారిచే రచింపఁబడినది. ఈయది మిక్కిలిచక్కఁగానున్నది. ఇయ్యది సర్వకళాశాలాధ్యక్షులు వీక్షించిరేని, బి. ఏ. పట్టపరీక్షకుం దెలుఁగునఁబఱనీయగ్రంథముగా నిర్ణయింతురనియెంతుము.

సీ॥ కబ్బమచ్చతెలుంగుగంగడు నొప్పెడుసత్యవిజయనామ సముచితంబు। ఘనహరిశ్చంద్రసత్కథపద్యమయమగుఁ బార్థసారధిబాల్యపరిచితంబు। నగుటనియ్యదిగనసయ్యెడు నవనీతభాండంబనంగను బ్రబ్బునుబ్బు। భాగ్యవంతులకబ్బుఁబరికింపఁజవులుబ్బునెఱపజ్ఞానాగ్నినిజమనియెడి। నేయిపొదవెడునొక్కరూపాయనిచ్చి। కొనుఁడుచవుకగజనులు పెన్గొండనుండు। నట్టియయ్యనకోటన్వయాబ్ధిశశ్యుఁబరఁగు। పార్థసారధిసెట్టిప్రౌఢవ్యకృతిని॥

---:O:---

## శ్రీఅముద్రితగ్రంథ చింతామణి.

సంపుటము. 10.) నెల్లూరు. జూన్ 1897. (సంచి. 6.

### కృతివిమర్శనము.

1. పెనుగొండలోఁ బ్రస్తుతమునందాంగ్లేయ [illegible] మహారాజశ్రీ, అయ్యనకోట పార్థసారధి సెట్టిగారిచే రచి [illegible]

యింపఁబడిన "సత్యవిజయమను నామాంతరముగల శుద్ధాంధ్రనిర్వచన హరిశ్చంద్రోపాఖ్యానము" విమర్శనమునకై గ్రంథకర్తగారిచేఁ బంపఁబడి మాకార్యస్థానమలంకరించి నందునఁ దదముట్టద్దిలకించితిమి. ఇక్కవి కులాలకులుఁడు. మానెల్లూరు పట్టణవాసుఁడు. రాజకీయోద్యోగమునకై పెనుగొండలోఁగాఁపురమున్నవాఁడు. కుమ్మరవారిలో నొకకుమ్మరసెల్లదక్కఁ దక్కినవారెరును గ్రంథముల వ్రాసినట్లగపడదు. శ్రీమత్తిక్కనగారు నెల్లూరునందు భారతము రచియించుకాలమునఁ గుమ్మరగురునాథుండను నొకరుఁడు లేఖరిగానున్నట్లులోకప్రసిద్ధమైనవదంతియున్నది. అది యటుండనిండు శ్రీపార్థసారథిశ్రేష్ఠిగారీగ్రంథమును మిగుల రమణీయముగ వ్రాసియున్నారు. వీరు శంకరకవి విరచితహరిశ్చంద్రోపాఖ్యానమును మాతృకగాఁగొని దీనిని శుద్ధాంధ్రనిర్వచనముగా రచియించియున్నారు. వీరు కొన్నిస్థలములయందు దానినతిక్రమించి మంచిమార్గములం బోయియున్నారు. అర్థానుస్వారనియమమున్నీడక, రేఫశకట రేఫసాంకర్యములేక, క్త్వార్థకసంధిరాకుండునట్లు నియమముగా రచించియున్నారు. శైలితోఁబాటు తెలుఁగుసామెతలనేకములగపడుచున్నవి. శ్లేషగలపద్యములచటచటఁగనంబడుచున్నవి. ఈగ్రంథమునందలి చమత్కారముం జూపుటకు మాయభీష్టము చొప్పున విమర్శించినఁ బ్రతిపద్యమును మరలనిందుఁ బ్రకటింపఁబడవలసియున్నదిగాన నాపద్ధతిని విరమించుచున్నారము.

2. ఈగ్రంథమునందలి తృతీయాశ్వాసమున 205వ మాలినీవృత్తమున "సిరిపడఁతిబోజుంగాచేవరాకాసిగొంగా" యనియున్నది. బోజుంగనవిటుఁడని విస్పష్టముగదా. సిరిపడఁతిబోజుంగాయను సంబుద్ధిపరముగాదని తోఁచుచున్నది. బోజుఁగుశబ్దము భర్తయందుఁ బ్రయోగింపఁబడియుండలేదు. సిరిపడఁతికి విష్ణువుభర్తగాని విటుఁడుగాదుగదా. అచ్చతెలుఁగురామాయణమున బోజుఁగుశబ్దము విటునిపరముగఁ బ్రయోగింపఁబడియున్నది. ఎట్లన,

క॥ సిరులచెలిమగనియడుగునఁ। గరమరుదుగఁబొడమిమున్జగంబులయందుఙ్।
గరగరికనెఱపుజక్కర। విరిఁబోఁడిబోజుంగప్రేఁతవేల్పులగొంగా॥

అని ప్రయోగింపఁబడియున్నదిగాన నీపదమునుగుఱించి గ్రంథకర్తగారియభిప్రాయమును వినుటకుఁ గుతూహలపడుచున్నారము.

మఱియుఁ బంచమాశ్వాసమున 308వ పద్యము.

క॥ ఎందాఁకఁ బ్రోర్జుజాబిలి। లెందాఁకిఁకఁ బ్రోతమినుకు లెందాఁక జగం।
బెందాఁకఁ జుక్కలుండును। యందాకిఁక బ్బమెంరు నలరుఁగాతఁ॥

అనియున్నది. దాఁకశబ్దము దనుక యొక్క రూపాంతరముగదా. ఇది ప్రాత ప్రతులలో లేకకళా. నైపద్యమున రెంటం బ్రయోగములగపడుచున్నవి. అం దాఁకిఁకబ్బము" అనునపుడు కళగాను దక్కినస్థలముల ద్రుతప్రకృతికములుగాఁ బ్రయోగించుటకుఁగల కారణమును వినఁగోరుచున్నారము. ఈగ్రంథమున 1189 పద్యములున్నవి. గ్రంథము వెల యంచకూలితోఁ జేసి రు 1—2—0 లు భాషాభిమానులందఱుఁ దప్పక తెప్పించుకొని చదివి గ్రంథకర్తను గౌరవింతురని కోరుచున్నారము.

—————:o:—————

ప్రభావతి.

కడప 1897సం॥ సెం నెల 24 తేది.

సత్యవిజయము:—ఇయ్యది అయ్యనకోట పార్థసారధి శ్రేష్ఠియను కులాలకులాలంకారునిచే శుద్ధాంధ్రమున నిర్వచనముగ రచియింపంబడినది- ఇక్కవి నెల్లూరుశంకరకవికృత హరిశ్చంద్రోపాఖ్యానమును మేలుబంతిగఁగొని నిజచమత్కృతిం జేర్చి యిద్దానినైదాశ్వాసములుగ రచియించినాఁడు- శ్రీమద్రామాయణము నాంధ్రమున రచియించిన మొల్ల అను నిక్కులపుగరితకు యిప్పటివఱకుఁ గలిగియున్న నద్వితీయత్వమునకు నిక్కవివరుండు హానిదెచ్చె- ఆయమ కవిత్వమున ఛందోవ్యాకరణశాస్త్రవిరుద్ధ ప్రయోగములు పలుచోట్లఁ జూపట్టుటంబట్టి యక్కొ అంతవాపికొననాయమయె యీయన గాఁబుట్టి రవింశజుఁడగుట నీహరిశ్చంద్రచరిత్రంబున లక్షణముగాను- సరసముగాను రచియించెనా జూపట్టెడు- ఈకవివ్యవహారదశలోఁ దనకుఁగల ఆంగ్లేయభైషజ్య కర్మసంబంధములగు తొందరలెన్నియున్నను నీ కృతి వ్రాయుటకవకాశము గలిగించుకొనుట మిగులశ్లాఘ్యమైయున్నది- ఈయనకుఁ గలయాంధ్రభాషాపాండిత్యమసదృశము- కవితానైపుణ్యమును అర్థసౌలభ్యమును పాకసౌష్ఠవమును నెన్నఁదగియున్నని- శ్రీకుమారాభ్యుదయకృతికర్తయు వీరును శ్రీవైష్ణవమతానుసారులయియున్నను నామతమునందు వారికున్న [illegible] పాతము వీరికిలేనట్లు వారిగ్రంథములో రతిశివసంవాదమున్ను, దీనిలో హరిశ్చంద్రుఁడు విశ్వేశ్వరు నిదర్శించుపట్టును జూచినవారికి విస్పష్టమగు- మఱియులోకోక్తులను నా

సమున నిమిడించుకొను నేర్పు వీరియందు తెల్లముగా గనుపడుచున్నది- దీని పద్యప్ర శ్వాసములోని శుద్ధనిరోష్ఠ్యసీసము- కందగర్భితమణిగణనికరము వీనింజూడ వీరికి చిత్రబంధకవితానైపుణియును గలిగినట్లు తెలియుచున్నది- అప్పకవి మతమును ననుసరించి యితని గ్రంథమును నిరసించువారికి గాక పోయినను నిష్పక్షపాతబుద్ధిం జూచువారికి మాత్రమీప్రబంధ మధునాతన గ్రంథములలో వన్నె మీఱుచున్నట్లు గన్పట్టక పోదు

—————:0.—————

## ఆంధ్రప్రకాశిక.

చెన్నపురి.—1887 సం॥ ఏప్రేలు 14వ తేది

దీనిని రచియించినకవి అయ్యనకోట పార్థసారథిశెట్టి. యీతండు కులాల కుండు ఇప్పుడు పెనుగొండలో హూణవైద్యమును చేయుచుండువాఁడు- యిదివరకెందఱో కవులు పూర్వికులు నాధునికులుంగూడ నీసర్వోత్కృష్టంబగు సత్యహరిశ్చంద్రుని కథను పురాణమువలెను ప్రబంధశైలిని నాటకముగను రచియించియున్నారు. అంబుశంకరకవి విరచితంబగు హరిశ్చంద్రోపాఖ్యానము మొదటిది- దీనియందలి శైలి పురాణశైలిగానుండును. ఈసత్యవిజయము నందలి శైలి యన్ననో ప్రబంధ పద్ధతిం బోలియున్నది- ఇందలి కథాభాగము "ఆబాలగోపాలము"నకుఁ దెలిసినదియయినను దీనికవి తేటయగునచ్చతెలుఁగునను కవితా చాతురీధురీణతవలన హృదయరంజకముగ రచియించియుండుటంబట్టి ఈగ్రంథమెంతయుం జదువఁదగియున్నది. ఇతనికవిత్వము సులలితము- అచ్చతెలుఁగుగనుండవలయుననియు సర్వాచ్ఛనముగానుండవలయుననియుఁ గష్టించి బాల్యేర్పఱచుకొనినను గ్రంథము యొక్కనడక బహుశ్లాఘ్యతరముగానున్నది- కొందఱు పురాతనకవులవలెగాక యీనాయకుని కవిపురాధియష్టాదశవర్ణనలయందు నమితముగఁదేలిసోలక సముచితంబులగు శబ్దార్థాదియలంకారంబులఁ గొన్నిటిని మాత్రమే మితముగఁ బ్రయోగించి నూతనములగు సమానాదులఁ గల్పించి యెంతయు రమణీయముగఁ జేసియున్నాఁడు- మొట్ట మొదటిదియగు నింద్రప్రభారంగమును వసిష్ఠవిశ్వామిత్రులకోపాటోపంబులను జక్కఁగ వ్రాసియున్నాఁడు- ఇక్కథాభాగముకందుకూరి వీరేశలింగము పంతులుగారిచే వ్రాయఁబడిన హరిశ్చంద్రనాటకమునందలి మొదటియంకమునం బోలి

యున్నది. వేఁటవర్ణన పెద్దనగారి వర్ణనవలెనున్నది- రెండవయాశ్వాసము అలంకారభూయిష్ఠమయి రసికజనమనోభిరామంబుగనున్నది- అయిన నీగ్రంథమునం దెల్లయుత్తమోత్తమంబగు భాగము నాలుగైదవ యాశ్వాసంబులేయని నొక్కి వక్కాణింపఁదగియున్నవి- ఇందు శోకరసంబు అమితంబు- భీభత్సభయానకరసంబులు చెలువొందియుండుటంబట్టియు లోకోక్తులనేకములు సమయోచితంబుగఁ బ్రయోగింపఁబడుటబట్టియు చంద్రమతిహరిశ్చంద్రులయొక్క దుఃఖము కఠినచిత్తుల మనసులంగూడఁ గరగించునంతటి స్వాభావికముగనున్నది. కాలకౌశికుని కఠినస్వభావము మిగుల నసహ్యముగనుండునటుల కవిబాగుగ వ్రాసియున్నాఁడు- ఈకవియొక్క కవితామాధుర్యప్రాశస్త్యంబులఁ బ్రకటింపనీయొక్క గ్రంథమే చాలును. చదువఁజదువనితనివాక్కు నిరర్గళమై క్లిష్టరహితమై సొంపుగనియున్నది, ఇతండీయచ్చ తెలుఁగునందు యమకములను వృత్తములను దండకమును సహజముగనుండునటుల కవనము చేసినరీతియెంతయుఁ బొగడఁదగియున్నది- అంత్యప్రాసములును ముక్తపదగ్రస్తములునుగాక శ్లేషాద్యర్థాలంకారములచే నీకవితయను బాలికారత్నమున లంకరించియున్నాఁడు- ఈయనకవిత్వమునందెల్లెడలనురమణీయంబులగు పద్యంబులనేకంబులచ్చటచ్చటఁ గాననయ్యెడి.

———:0:———

## శశిలేఖ.

చెన్నపురి. 1897సం॥ మే నెల 4వ తేది.

సత్యవిజయము అను నామాంతరముగల శుద్ధాంధ్రనిర్వచన హరిశ్చంద్రోపాఖ్యానమును కుశాలకులుండును, ఆంగ్లేయభైషజ్యకర్మ చాతురీ ధురీణుండును ప్రస్తుతము అనంతపురమండలములోని పెనుగొండపురనివాసియునగు మ॥రా॥శ్రీ అయ్యనకోట పార్థసారధిశ్రేష్ఠిగారిచే వ్రాయంబడి మాకార్యస్థానమున కనుపంబడినది- హరిశ్చంద్రకథమనదేశములో నెల్లవారికిం దెలిసినదైనందున దీనిగురించి వ్రాయవలసిన యవసరమంతగా లేదు- పాకము సరసముగానున్నది- సెట్టిగారికౌశలమును జూపుకొన్నపద్యములనిటముద్రించితిమి.

* *

గీ॥ పాలబుగ్గలు చేరెల్రకాలుగనులు। మొలకహూఁకటులపరంజితళుకుటూడలు।
సిగ్గులుంగనిపిఱుఁదులుఁజిన్నినగవు। లలరనడచెదుఁబడితప్పటడుగులిడుచు॥

గీ॥ అలవసిష్ఠునిపద్దేటఁగలిపిపేరు। వడసెదనటంచుఁదలఁచిన, "వస్ట్రియాన।
మొదలుచెఱచె" నన్నట్లు నా మొదటిపలుకు। ప్రతినకేచేటు నేఁడు పాల్పడఁగనయ్యె॥

క॥ మగవారికంటె మగువలు। తెగువన్ వెసనాఱురెట్లు దేరుదురని చె।
ప్పఁగఁబెద్దలకడవింటిని। దగనీయెడనద్ది నేఁడు తార్కాణించెన్॥

సెట్టిగారు ఆస్పిటల్ అస్సిస్టెంటుపనులంజూచుచు, ఆంధ్రభాషమీఁదయింతయభిమానముంగలిగి గ్రంథరచనకువ్యవధికలిగించుకొనిన దెంతయుశ్లాఘనీయము. గొప్పయుద్యోగములందుండువారికినీభాషయందిట్టి యభిమానముండినచో నిదివన్నెకెక్కుననుటకు సందేహములేదు.

———:o:———

ఆంధ్రభాషయందుశబ్దసామగ్రియత్యల్పమగుట- గ్రంథములరచించుటమిగులకష్టముగనుండును; అయినను నీగ్రంథము బహుశ్లాఘాపాత్రముగ నిర్వహింపఁబడియున్నది,

2. శైలి:—ప్రశస్తములు- కవిసమయసిద్ధములు- మృదుమధురములు-సందర్భోచితభావరసోత్పాదకములు- విస్పష్టార్థసూచకములు- నగు, శబ్దములు, సమాసములు, వాక్యములుంగలిగి హృద్యములగు పద్యములచే నిర్దుష్టభాషాభూయిష్ఠంబును, కదళీపాకవిపాకమహితంబును, శయ్యార్థచిత్ర- శబ్దచిత్ర, స్వభావోక్త్యాదికాభిరామంబును నై మిగులసొంపుసంపాదించుచున్నయది. ఈయంశములకన్నిటికి నీగ్రంథమునుండి యనేకోదాహరణములం జూపవచ్చును- గ్రంథము సశ్రద్ధతోఁజదువనవకాశములేనివారలు,సులభముగఁజూడనవకాశముగలుగునట్లు- కొన్నిటినిమాత్రమిటఁజూపుచున్నాను- పరిశీలింపుఁడు.

| విషయము. | ఆశ్వాసము | | పద్యసంఖ్య. |
|---|---|---|---|
| 1. శైలి:— | 1 | ... | 54- 55- 149-160- 169-170. |
| | 2 | ... | 14-26-74-101-103-105-110-130-131-148-165-177-183-186-193-198 |
| | 3 | ... | 4- 18- 126- 160- 173- 193. |

| | | |
|---|---|---|
| | 4 | ... 4-5-14-19-69-76-83-103-104-149-193-208. |
| | 5 | ... 29-32-33-36-37-45-57-76-114-145 243-253. |
| 2. శయ్య. | 1 | ... 119. |
| | 2 | 101-103-106-125-129-130-131-172-177 |
| 3. శబ్దచిత్రము | 1 | ... 129-170. |
| | 2 | ... 29-54-55-101-103-149-165-239. |
| | 3 | ... 158-188. |
| | 4 | ... 19-76-257. |
| | 5 | ... 86-94-106-153. |
| 4. అర్థచిత్రము | 1 | ... 1-50-51-61. |
| | 5 | ... 113. |
| 5 స్వభావోక్తి | 2 | ... 17-130-163. |
| | 4 | ... 115-169-180. |
| | 5 | ... 18. |

3 కవిత్వధారనిరర్గళప్రచారంబై విలసిల్లుచున్నయది- పద్యములు ప్రయత్నపూర్వకంబుగఁ గూర్పఁబడినవిగాఁ దోఁపవు- శబ్దములు- తాముగాఁదమతమ నెలవుల నెలకొని, పద్యములుగా నేర్పడి, కవికిస్ఫురించినవో యను భ్రమ కలుగుచున్నది.

4. అల్లికబిగియనన్యసామాన్యంబై విరాజిల్లుచున్నది- మొదటిమూఁడాశ్వాసములయందలి పద్యములు ప్రౌఢమృదుతరబంధములుగాను, తక్కిన రెండాశ్వాసములయందలి పద్యములు ప్రౌఢతర- మృదుబంధములుగాను దోఁచుచున్నవి.

5. గణవైరళ్యంబును- యతిప్రాససౌలభ్యంబును గ్రంథంబు నందంతట నేకరీతిగా నిండి, యత్యంతహృదయంగమములై యున్నవి.

6. శబ్దసామగ్రియన్ననో- యాంధ్రశబ్దగ్రామమో- [illegible]కివాసగ్రామము నని రూఢిగాఁ జెప్పవచ్చును.

7. ఇతరశుద్ధాంధ్రగ్రంథకర్తలవలెఁగాక, యీకవితనగ్రంథమునను నిరంకుశకవితాపాండిత్యసూచకములగు ననేకవృత్తములను రచించియున్నాఁడు ఇది మిగులశ్లాఘనీయము.

8. ఈగ్రంథమిదివఱకుఁగల శుద్ధాంధ్రగ్రంథములకెక్కుడయని - కాని - తక్కువయనికాని వివరించుటకుందగిన తారతమ్యపరిజ్ఞానము నాకు[illegible]న్నను, వానితోనిది సర్వవిధములఁదులఁదూగఁజాలియున్నదని మాత్రము నేను నొక్కి వక్కాణింపఁగలను.

9. ఈకవి - నణ - ప్రాసమైత్రి నంగీకరించియున్నాఁడు (2 యాశ్వాసమున 209 పద్యము) - ఇది ప్రమాదవశమునఁగలిగియుండవచ్చును, మతాంతరమని భావించిన దోషముండదు,

10. కొన్నిపద్యములయందుఁ బాదాదిని అర్థానుస్వారములును పఁబడియున్నవి. (1ఆశ్వాసము 121-125-138, 2ఆశ్వాసము 18-19) ఇవి యచ్చుతప్పులుగా నుండవచ్చును. కొందఱిది సరియని భావించి యుండునట్లుం దెలియ వచ్చుచున్నది. పూర్ణార్థబిందువులు, అన్వర్థమగు - అనుస్వార నామము కలవి - వాఁడు - వీఁడు మొదలగు శబ్దములయందదియే యక్షరము ననుసరించి పలుకఁబడునదియు సువ్యక్తము కాకున్నను, అతఁడు, ఇతఁడు - మొదలగువానియందది పూర్ణబిందువై, తకారమున ననుసరించియుచ్చరింపఁబడి, యాతకారమును గురువర్ణముగాఁజేయుచున్నది. ఇందువలన నీయనుస్వారములు వెనుకటియక్షరములననుసరించి యేయుండునని చెప్పనగు - ఈకారణముచే నట్టియర్థానుస్వారములు పాదాంతములయందు నిలువఁదగి యుండునుగాని పాదాదియందు నిలువవు.

రొద్దము హనుమంతరావు,
ప్లీడరు, పెనుగొండ.

———:o:———

సీ॥ జల్లిపదంబిడకల్లుపథంబునఁ దెల్లమిఁజనునచ్చఁదెలుఁగులందుఁ। దొలికవివర్ణన
ల్దాలఁగకవానికిన్వన్నెవెట్టునవీనవర్ణనలను। బాకశయ్యారసభావముల్దఱుఁగని
శబ్దచిత్రార్థపాష్కల్యములను। దోషంబులేశముద్దారయనివ్యాకృతినలయలం
కృతిలక్షణానుకృతుల। కృతులకేకాకకృతులిటుకృతములగునె। యగుననఁగద
పార్థసారథియగుటఁదనకు। సత్యపూర్వవిజయపరిష్కర్తయగుచు। మఱిసదార్జు
నకీర్తిచేమలయానగుట॥

పంచాంగం. దేవరాజపెరుమాళ్,
తెలుఁగు పండితుఁడు,
*S. P. G. College Vepery, Madras.*

శ్రీలక్ష్మీనృసింహాయనమః.

క॥ అయ్యనకోటాన్వయభవుఁ। డయ్యనవద్యగుణమణిగణాస్తిఁ సిరిగ।
న్నయ్యనగుపార్థసారథి। యయ్యనడపెసత్యవిజయమచ్చతెనుఁగునన్॥

క॥ సత్యహరిశ్చంద్రకథన్। సత్యాధిపసత్యధీశసత్యవులకృపన్।
సత్యవిజయమనుపేరన్। సత్యాచ్ఛాంధ్రోక్తిఁబార్థసారథిసెప్పెన్॥

క॥ ధరశుద్ధాంధ్రగ్రంథము। లరుదగుటంజేసికవులకక్కుబ్బమ్ముల్।
విరచించుశ్రీలక్ష్మీ। నరసింహుఁడొసంగుగాతనవసత్కరుణన్॥

గంజాముమండలము  ఇట్లు.
పర్లాకిమిడి. మచ్చ- వేంకటకవి.

19—4—1897. శ్రీశుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనకుశచరిత్రాద్యనేక గ్రంథకర్త.

———:0:———

సీ॥ ముచ్చటగానున్నదచ్చతెనుంగిది, కతయన్నఁబుణ్యంపుఁగలిమికాదె। పదములన్నారసాస్పదములు, భావంబు భావరంజనమయివఱలుచుండు। శబ్దాద్యలంకారసారస్యమునమించు నర్థగౌరవతచేనధికతఁగను। పద్యపద్యమునందుఁబరఁగులోకోక్తులు వృత్త్యనుప్రాసంబువిస్తరిల్లు॥

గీ॥ నౌరకవిపార్థసారథిభూరికీర్తిఁ। గంటివిదినీపురాకృతకర్మఫలము।
మించెనీకృతితెనుఁగునమిన్నయనఁగ। హెచ్చుపల్కననదిమొగమిచ్చకమగు॥

క॥ ధాత్రినినీదగుసత్కృతి। చిత్రచమత్కృతులవెలసిచెల్వొందుక్రియన్।
మిత్రమ, నీదగుకీర్తియుఁ। బత్రిరఘునికృపనుబ్రబలిప్రస్తుతికెక్కున్॥

బళ్ళారి,  కోలాచలం శ్రీనివాసరావు,
2వ గ్రేడు ప్లీడరు.

———:0:———

సుధీరత్నమా॥

భవత్ప్రేషితంబగుసత్యవిజయంబను నామాంతరంబుచేఁ గ్రాలెడుశుద్ధాంధ్రనిర్వచన హరిశ్చంద్రోపాఖ్యానంబను కావ్యరత్నంబునేనంది సంతసించితి. అదిమృదుమధురపదసందర్భములుగలిగి చక్కనిస్వభావోక్త్యాద్యలంకారములచేతను, మహాకావ్యోచితవర్ణనలచేతను శ్లాఘ్యతరమగు కవిత్వశైలిచేతను జెన్నొంది తెలగనార్య కూచిమంచితిమ్మకవి వరులకవిత్వమునసుకరింపుచున్నయది. ఇట్టిశు

ద్ధాంధ్రగ్రంథములఁ గాలేజాధిపతులు ప్రథమశాస్త్రపరీక్షకుం బఠనీయములుగ నేర్పఱచుటొప్పగునని నాయభిప్రాయము.

బళ్ళారి. }

ఇట్లు తమ నెచ్చెలి,
శ్యామజి. ఆనందరావు.

———:o:———

# సన్మార్గబోధిని.

*Bellary, 28th August 1897.*

## REVIEW.

ఓం.

ఈ యిహలోకమునందు మానవుల కనుభవింపదగిన యానందములలో కావ్యామృతరస పానానందము ముఖ్యమని యార్యులు చెప్పియున్నారు. అటులుండ, ఈ సత్యవిజయంబను గ్రంథపఠనముచేత యట్టిఆనందమును పొందుదుమోయను సందియంబువలదు. ఏలయనదీనినిరచించిన మ-రా-శ్రీ, (I. Parthasarathy Chetty) అ. పార్థసారథిశెట్టి అనువారు, సర్వజనానందకముగా జేసినవారేగాని తనపాండిత్యమును లోకమునకు వెల్లడిజేయపూనుకొన్నవారు కారు. ఈ భావము ఈ కృతినిపఠించిన తెలియఁదగును. ఇందుకు నిదర్శన మీగ్రంథమును పామరజనులకుఁదెలియునటుల వ్రాసియుండడమే. ఈగ్రంథము నందలి పదలాలిత్యము, పాకసైలక్షణ్యము, శబ్దసౌష్ఠవంబు తత్తద్ఘట్టోచితాన్యాదృశానవద్యైకైక పదార్థాభినివేశ చాతుర్య సాహిత్యము, తత్తద్వర్ణన సందర్భ సముచిత సాభిప్రాయ పద్యములును గొనియాడదగియున్నవి. ఇందుకు నిదర్శనములైన నీక్రింద కొన్నిపద్యములు వ్రాయబూనెదము.

సీ॥ కడిమిరావులుదండ నడరనుంటిమి కానఁగడిమిరావులుదండ నడరఁగలిగె।
నెత్తమ్ములఁదలిర్ప నేర్చియుంటిమి కాన నెత్తమ్ములఁదలిర్ప నేర్పుగ[illegible]। వే
గులుగనుసన్న వెలయునుంటిమి కాన వేఁగులుగనుసన్న వెలయఁగలిగె।
లేఁకలుదరిఁగ్రాల వీఁకనుంటిమి కాన లేకలుదరిఁగ్రాలవీకగలిగెఁ।
[illegible]చెపైదర్పమన్నారికంబుపవవిఁ। దొలఁగివచ్చియు నయ్యాదిగలిగె మగుడ।
నమచోటపుపుఁజలుకుల ననుఁగుఁజెలియ। నడజడిదొలంగ నడజడినుడిపి
మచేము॥

సీ॥ కిరాతులార నీటిజక్కవలార మీరైనఁజూపరే నాముద్దుపాపనిందు। దరులార
చెంచుచౌదరులార మీరైననరయరే ననుగన్నయసుఁగునిందు। మఋలారరే
యిద్రిష్టారులార మీరయినఁగానరే నామేలికందునిందు। గడులార మొకపునం
గడులార మీరయినఁగంటిరే నాకూర్మికొన్నునిందు॥ కొమ్మలార నిరాశారికొ
మ్మలార। మాపులార నెఱాగాడ్పుమాపులార। దారులార జగాజడదారులార।
ఏడనున్నాఁడొ యెఱిగింపరేకొమారు॥

సీ॥ పిసురాకుతలిమంబుఁ జిన్నబుచ్చెడు నీదునును గేలు గవకె యిప్పెనపుగంట్లు।
నెత్తమ్మితూండ్లమన్నింపనిసేదుకై దండలకాయిట్టిదడపుగట్లు। పూదుమారంబిం
తపాలయనోర్వనిసేదు నంజలకాయిట్టియరిదితార్క్ష్యు। అలరింతమోవఁబేరల
యు నీజిగిమేనికాయిట్టి కడిఁదిపగ్గంపుటురులు॥ అనయమునవళ్ళైనిండ్లనం
తిపురిని। గలిమిమెలఁగెడు నీకెయీవెలుచపాటు। కటకటాయల్ల తొలిజన్మ
గట్టువాఁత। దరమెతప్పింపఁ బుడమినెవ్వరికి నేని॥

చ॥ అనియనిఁదీయువాని ననునారయ రేయని వేఁడువానిఁజి। వ్వానుబుఋనంటు
వానిఁగయివాలిడకే మఋవానిఁబోవఁగాఁ। జనుపడునేను సేఁడరయంబైద
దలి, నందన-నాలి, సేతెఱం। గునఁగోలనాక యిక్కడిఁదికొంతమునణ దెగ
టార్తునక్కటా॥

ఉ॥ ఏటికివేల్పుపేనికడకేగితి,నేగితిఁ బో,యతండునం। దేటికినిక్కువంబుపలుకై
త్తెనొ, యెత్తెనుబో,వసిష్ఠుఁడం। దేటికి వీనినెక్కువగసెంచెనొ, యెంచెనుబో,
యెఱుంగకే। నేటికినామికణ బ్రతిననెన్నితిఁ గల్లరివీనిఁజేయఁగణ॥

తాత్కాలికపు స్థితినిఁబట్టిచూచిన భూమండలమంతయు రాజభాషయైన హూణభాషాచ్ఛాదనమై యున్నదనుట తెల్లంబైనవిషయము. హిందువులు మన స్వదేశభాషలయిన ఆంధ్రద్రవిడము మొదలయిన భాషాపఠనములను మూలకుఁదోచి, విశేషముగా తనయొక్కయు, తమసంతానములయొక్కయు కుశలత్వమును హూణభాషాభివృద్ధియందే తనమాతనువిడిచిపెట్టి లంజ తల్లినిగౌరవించురీతి, ఉపయోగపరచుచున్నారు. ఇటువంటికాలములో ఈ సత్యవిజయంబను గ్రంథంబు బయలుపడినది ఆశ్చర్యమయినఅంశమై కొనియాడఁదగియున్నది. పూర్వపుకవీశ్వరులచేత రచియింపబడిన అన్ని కావ్యములలో శుద్ధాంధ్రమైన రచియింపబడినవాటిసంఖ్య మిక్కిలికొంచము వాటిలో నిర్వచనరూపముగా నుండునవి లేనేలేవనితోచుచున్నది. ఇప్పుడుండు శుద్ధాంధ్రకావ్యములన్నియు

ఆధునిక కథలచేత రచించఁబడినవి. అటుండ ఈ గ్రంథముశుద్ధాంధ్రనిర్వచన రూపమై వ్రాసియుండుటనుఁబట్టి ఈ గ్రంథకర్త వాణీకటాక్షమును బొందినవారై నెగడువారుగానున్నారు వీరివంటివారు యింకకొందరు శ్రమపడి మనస్వదేశభాషలయభివృద్ధిచేయుదురని నమ్మియున్నాము. పాపీచిరాయుః, సుకృతీ గతాయుః అనుటకువిరోధముగా, విశ్వాత్మకుఁడయిన యాపరమాత్మ, ఈసత్యవిజయపుగ్రంథకర్తలయిన మ-రా-శ్రీ. పార్థసారధిశెట్టిగారికి ఆరోగ్యములనిచ్చి యిటువంటిగ్రంథములనింకయునేకము వ్రాసి లోకమునకుపకారము నర్చి, యెల్లర స్వదేశాభిలాషికులుగఁజేయుటకు ప్రోద్బలపరచవలెనని ఆ పరమాత్మనుగూర్చి వందనములొనర్చుచున్నాము.

C. R. N,
Bellary.

---

— * శ్రీమతే రామానుజాయ నమః * —

ఉత్పలమాలిక

శ్రేష్ఠకవిత్వనవ్యమణిసింధువతంసము పార్థసారథి
శ్రేష్ఠికృతంబుఁదత్ప్రవివరేణ్యసమర్పితకావ్యసన్మణి।
ప్రేష్ఠముఁగేవలాంధ్రమునరీణవచోవిభవాతిరేకస్ఫుం।
దిష్ఠమునందినందితమతిన్ సరవిన్ బఠియించినాఁడనే।
నిష్ఠనుదత్ప్రబంధమకనిష్ఠమనస్స్ఫురితినాదిమండిభ్రా।
జిష్ఠము సాధువృత్తతతిచే స్తవనీయగుణక్రియాళిభూ
యిష్ఠము చిత్రచిత్రతరనైకవిధావృతసద్రసాళిబం।
హిష్ఠము సౌమనస్యజనతేడితభాస్వదలంక్రియాళిబృం।
దిష్ఠము చూడఁజూడఁగప్రదిష్ఠమనోహరవాక్యపుంజసం।
దిష్ఠము బంధరీతులఁబ్రభిష్ఠము గర్భకవిత్వనైపుణీ।
స్విష్ఠము దోషరాశికిదవిష్ఠము చిత్రకవిత్వచాతురీ।
ధేష్ఠము శ్రీవిలక్షణసుశిక్షితశిష్టప్రయోగయోగవ।
ర్షిష్ఠము ధీప్రభశిష్ట్రసంతరీతినిలక్షణలక్ష్యకోటనా।
ల్పిష్ఠము పాతకాళికిఁద్రపిష్ఠమటంచుఁదలంచువాఁడక్షే।
పిష్ఠప్రభావిధాననయవిష్ణగతిన్ సుధురీణమార్యనే।
దిష్ఠచరిష్ణువాటనుబత్రిష్ఠఁగనన్ ధరనందియుంటె, శ్లో।

శిష్టగుణాంకులై తమప్రతిష్ఠకుఁ గాంచరె కావ్యభూషణల్।
నిష్ఠురవృత్తిఁ జేయునవినీతులు లేనివిశిష్టశిష్ఠనల్।
గోష్ఠులవాసి వన్నెఁ గని తోరము గాఁగ ధరిత్రిపై నిదా్రి।
ప్లిష్ఠశుభంబుఁ గూర్చుఁ గవికిన్ గృతిభర్తకు పావశంబునన్॥

కం॥ విశ్వామిత్రుఁడు దక్కఁగ
విశ్వంబున నెవఁడు సత్యవిజయము రోయన్।
విశ్వామిత్రుఁడు దక్కఁగ।
విశ్వంబున నెవఁడు సత్యవిజయము రోయన్॥

ఉ॥ తిమ్మనయాంధ్రసత్కృతులఁ దీరిచి తీరిచి నేర్చినట్టి పా। కమ్మున పార్థసారథి జగన్ను
తకీర్తిని దొట్టతొల్తనే। స్వమ్ముగఁ జేసికోఁగలిగెఁ జంద్రమతీశుకథన్ వెనుంగుప।
ద్యమ్ముల వ్రాసి, సత్యవిజయమ్మనశారికృపావశంబునన్॥

ఇట్లు
సుకవిజనవిధేయుఁడు,
వావిలికొలను సుబ్బరావు.

———:o:———

వైజయంతి. *Septr, & October. 1897.*

కృతివిమర్శనము — సత్యవిజయము.

———:o:———

మ-రా-రా-శ్రీ, అయ్యనకోట పార్థసారథిశ్రేష్ఠిగారిచే రచితమైన సత్యవిజయం బను శుద్ధాంధ్రనిర్వచన హారిశ్చంద్రోపాఖ్యానముఁ దత్కృతికర్తగారివలనం గృతజ్ఞతాపురస్సరంబుగఁ గైకొంటిమి. శుద్ధాంధ్రనిర్వచననియమ వాగురాబంధనంబులకు లోఁబడియునిక్కవి నిజానుపమరచనాపాటవంబు తేఁటపడ నీకృతిమణి నాంధ్రజనులకొసంగికృతార్థులగుటకు సంతసించితిమి ఇక్కావ్యంబునందలిశైలియెంతయు హృద్యంబై వఱలుచున్నది.

వర్తమానకవితిలకస్తుతిపద్యంబిందుం బొడగాంచుచున్నది.

తే॥ ఇప్పటికయీనరులమెఱిమెప్పఁగన్న, కందుకూరివీరేశలి[illegible]మునకెరఁగి
పార్వతీశ్వరశాస్త్రికిబత్తినలిపి, మదినివేంకటరత్నశర్మను దలంతు. పు. 3 ప. 14

అసమానశేముషీవిభవులగు నిక్కవిత్రితయంబును వినుతించు నిప్పద్యయంబే కృతికర్తగారియార్జవంబును, గుణాగుణవివేక పరిజ్ఞానవిచక్షణత్వంబుఁ జూపుచున్నది.

తనయోషిద్రత్నంబు నొక్కకటికిపాఱునికివిక్రయించియుఁ దానొక్కచండాలునికి సేవకుండయి శ్మశానవాటినెలకొని నీచవృత్తిఁ జరించుచుండియుఁ ననృతంబు రసనాగ్రంబునఁ బొరయింపనిచ్చగొనక యార్తరక్షకుండగు దేవదేవుండె దిక్కగుంగాత్మని కాలంబుఁ బోఁదట్టు నచ్చండాంశుకులమండనుబిట్టుడికింపఁ దలపోసి యాగాధిపట్టి కట్టిఁడియయి యామహీధవునకుఁ బుత్రవియోగజనిత చింతానలంబును గూర్చియుఁ దనివోందక యాచంద్రమతీసాధ్వికొక్క యపవాదంబు గల్పించి యతనిచేఁ దత్సతీశిరంబుఁ దెగవేయనుంకింపుడాముకుందుం డెడందఁగరుణించి యింకనొప్పరికించుట తగదని కడలివెడలికడువడిం జంద్రమతీ రక్షణార్థంబా శ్మశానవాటికకు నేగుదెంచువైఖరి యీక్రిందిపద్దెంబుల వర్ణితంబులయ్యె.

మ॥ సిరికిం జెప్పఁడు, చిందముం గనఁడు, వాసిం జుట్టువాలుంగొనం
దరయండొద్దబలంగముం, గరుడిండాయం జీరఁడొక్కింతయేఁ,
గురులం దీర్చుకొనండు, సాల్వోడలఁగీలొక్కల్పండు, కేల్సాఁచుకొం
చరితిం జంద్రమతిం ద్రిశంకుచోఱునొయ్యం బ్రోవవిచ్చేయుచో.

పు. 199ప 244

ఉ॥ వెన్నునివెంట, లచ్చిసిరివెంటవటారుబలంగమాపయిం
బ్రన్ననఁబక్కికేఁడు, నటవానిపయిం సుడివాలునాబడిం
గ్రన్ననఁజిందముం మొదలుగాఁగలయత్తెలిదీవిపాళెమే
పన్నిననివ్వెఱం వెడలివచ్చెనువచ్చినఁజూచిగుంపులై. ప. 245

క్రీడార్థంబు కాసారంబుఁజొచ్చినకరణీనాథుండునక్రదంష్ట్రావిటంకంబుల కుఁజిక్కివిడిపించుకొననేరక ప్రపన్నభావంబు దేఁటపడ నామొసలితోడి పోరు మాని యుచ్చలితశుండాదండుండయి మునిమండలాఖండలాదులకును రక్షకంబులును, నతజనార్తిలతాలవిత్రంబులునగు వైకుంఠవాసుపదకంజంబులం భక్తిపురస్సరంబు[illegible]పోయాతఁడె నాచతుర్భుజుండు కరుణించి కరివరముండయి కాసారతీరంబున నావిర్భవించు ఘట్టంబుననాపోతనామాత్యుండు భాగవతపురాణంబున రచించిన పద్దియంబు లిచ్చటజ్ఞప్తికివచ్చుచున్నవి.

ఇట్టి నూతనగ్రంథములఁ బరీక్షలకుఁ బఠనీయంబులుగఁ జేసి తత్కవివ రేణ్యులనింకయుం గావ్యంబులను రచింపఁ బ్రోత్సాహపఱుప మనసర్వకళాశాలాధిపతులు దొరకొందురని కోరెదము.

ఇక్కవివర్యులశైలీ రామణీయకంబుఁ దెలుప నొక కొన్నిపద్యంబుల నిందుదహరించెదము.

సీ॥ గొనబుమీఱఁగనల్లుకొనియున్నపవ్వంపుటీరంబుపడకటిల్లెరహింప
లలిఁగ్రిందఁ బ్రాఁకుమల్లెలపూలజొంపంబు తలిమంపుఁబానుపై చెలువుగొలుపఁ
బొన్నగున్నలఁదివెప్రోవుపెనంగినడంబుపూవిల్తుకయ్యంబుఁదెలుప
నాగఁగొమ్మలనుఁగ్రమ్ముచిగురుక్రొమ్మొగ్గలువాడమునైపులకల పొలుపుజూపఁ
దలిరుఁదిండలనులిగిల్కుపలుకుగాఁగఁ, జెలఁగుననతేనెసోనమైచెమటగాఁగ
నాలయుపయ్యెరవెడలునిట్టూర్పుగాఁగఁ, గలసిరయా,మనివలంతికానచెలియు.
పు. 22

చ॥ తఱియనుసేఁతగాఁడుదొలిదానొడఁబడ్డవితంబుదోఁపవి
స్రెలవకువెన్నెలన్ జిలుఁగుఁదెల్లనిరెంటమునేసివెండిపూల్
గొలఁగనంతటన్ బయఁటకొంగునమేల్జరిఁదమ్మినల్లినా
వఱలెనుచుక్కలన్ నెలయువాసిగనాకనమందునత్తఱిన్. పు. 29 వ. 164

P. S. CHARLU.

:o.

No. 4, Mallikeswaran Covil Street, Madras,
*29th September 1897.*

Dear Sir,

I have not had time to read your "Satyavijayam." On receipt of your reminder, I have read portions of it in order to form opinion. I am extremely happy to say with confidence that your work is sweet and readable, possesses much poetical merit, exhibits good taste and highly repays perusal. It is a happy exception to the general run of insipid literature now issuing from the press. The restriction of "Suddhandra" a very unhappy one in the case of other writers generally, one which is held up as an excuse for all short comings, is in your case under perfect and admirable control. In short, I seldom liked contemporary literature, but I like your work very much.

Yours very truly,
(Signed.) V. VENKATARAYA SASTRY,
*Senior Sanskrit Pandit, Christian College, Madras.*

Printed at the Rama Vilasa Press :— Bellary.

# OPINIONS OF THE PRESS

## AND

# PUNDITS.

## శ్రీ సత్యవిజయకృతివిమర్శనము.

సత్యసాధని.

*Madras, 30 November 1897.*

గ్రంథవిమర్శనము.

సత్యవిజయము. అను నామాంతరముగల శుద్ధాంధ్రనిర్వచన హరిశ్చంద్రో పాఖ్యానము:— ఇయ్యది ప్రస్తుతము (అనంతపుర) కుండలీపుర మండలములోని (పెనుగొండ) బృహచ్ఛైలమునందాంగ్లేయ భాషాశాస్త్రమునం దాధునికమన్నీలచే నెన్నికఁగని తద్వృత్తి నవలంబించియుండు కులాలకులావతంసమగు మ-రా-రా-శ్రీ, అయ్యనకోటయను గృహనామముగల పార్థసారథి శ్రేష్ఠిగారిచే మాకు పనుపందిలకించి మంచికైతయని యెన్నితిమిగాన మాయభిమతంబు నొకింత యిటను గ్గడించెదము. మున్నుకబ్బంపుముల్లెయనందగు మొల్లయు, తిగకంటి వానికీడగు తిక్కన్నగారికి లేఖకులు మెచ్చునట్టి లేఖరియునగు గురునాథుండను పై కవివంశజులగుటంజేసి యిక్కవిక్కృతి యొనర్చుట నవీనంబుగాదు. అయినను నీకబ్బంబబ్బురంబై వెలయుచున్నది. అచ్చతెలుంగున శబ్దజాలంబు మిక్కుటంబుగలేనికతన యనేకులు శుద్ధాంధ్రగ్రంథంబులు రచింపవననిని నాపుకొనిరి. ఇతండికాలంబున శుద్ధాంధ్రగ్రంథంబులన్నరచించిన వారికన్న వన్నెకెక్కునట్లు రచియించినది యత్యంతశ్లాఘనీయము. మఱియు రాచకార్యంబులందు కాలంబెల్లఁగడవవలసిన నీతండెంతటి యోపికతోఁ దనకుఁ దీనికగ్గునకొంచెపుసేపును

ఊరకపోనీయక సత్కార్యంబునందే వినియోగపఱిచిన వీరి సాహసంబునందఱు నచ్చెరువొందునట్లు చేయుచున్నదిగాన నిక్కవి నెంతయుఁ గొనియాడందగియుండుటంబట్టి దీనినింతటితో విరమించి కవిత్వవిషయముం గూర్చి మా యభిమతంబు-నొకింత ముచ్చటించెదము.

ఇందలి పద్యంబుల యల్లిక ధారాళంబుగను శబ్దవైచిత్రి ప్రకరణానుసరణ బద్ధంబుగను, రసంబు సమయానుసారంబుగను, పాకంబు పరిపక్వాంశుమత్ఫలా పాకంబుగను, సందర్భోచిత పదయుక్తంబుగను, అలంకారసంయుతంబుగను, కావ్యజనానుమోదంబుగను, సమ్మిళితంబై చదువఁజదువ నింపు పుట్టించుచున్నది.

ఈకవి పాండిత్యాతిశయంబు నీదిగువనుదహరించిన సత్యవిజయంబునందలి యొక్క పద్యంబువలన దేటపడఁగలదు.

గీ॥ విన్నకల్లంబువమ దఱివెజ్జుమందు।
సూఁదినూఱుంగఁజెవరిన పాదరసవు;
గుళికలఁజుక్కలమరెనుకూర్చికలుప।
నిడిన వెన్నయనన్నెలపాడవుదోఁచె॥

ఇట్టినిరుపమ ప్రబంధంబును మనవిద్యాశాఖవారు బి-ఏ-పరీక్షకుఁ బఠనీయ గ్రంథముగా నుంతురని నమ్మెదము. మఱియు నిక్కవిమతంబును నీపద్యంబు వలనఁగనుడు ——

సీ॥ తేటమాటలతోడ నీటుగాఁదనకృతుల్వ్రాసి పేయమది నెంచి తెలుఁగునేర్చె।
రాజులసభలలో రాజిల్లగా నెదభావించి యాంగ్లేయభాష నేర్చె।
రోగసంకటతులభోగభాగ్యులఁజేయఁదలపోసి వైద్యంబు నెలమి నేర్చె।
సత్యవాక్ప్రతిభమ సాటింపఁగా సిదె సత్యవిజయకృతి సల్ప నేర్చె॥
గొమరుమీఱఁగనయ్యనకోటపార్థ।
సారథిశ్రేష్ఠి, శ్రేష్ఠుఁడౌ నవనజనులు।
చేతులారంగనెత్తంగఁజేసె పెనార।
శ్రీనివాసాఖ్యసత్కవి ప్రేమనిటుల॥

——:0:——

| | | | |
|---|---|---|---|
| 46 | 16 | వతి | వలఁతి |
| 48 | 17 | తపసి | తబిసి |
| 49 | 15 | హూరుమిటఁ | హూర్కుమిటఁ |
| 56 | 8 | నలవడ | నెలకొన |
| | 23 | నింతిఁగొమరునితోఁ | నింతిగొమరులతోఁ |
| 57 | 7 | నట్టువుల | నట్టువల |
| | 18 | ప్రోకఁ | పోఁక |
| 58 | 6 | జమిల | జమలి |
| 59 | 14 | నింపునీ | నింపుటీ |
| 60 | 15 | విటతం | విటతటం |
| 61 | 3 | వాల్బాపుటూపులు | వాల్బాపుఁదూపులు |
| | 21 | చక్కదనము | చక్కఁదనము |
| 65 | 5 | ప్రవచ్చేనద | ప్రవచ్చేదన |
| 67 | 2 | ఁజేసే | ఁజేసె |
| 74 | 1 | బడంతియుక్ తబుసు | బడంతియుక్ దబుసు |
| 82 | 18 | వాసిక్ | నానల్ |
| 88 | 23 | గాళా | గాళి |
| 114 | 10 | వెలివాఁడ | వెలివాడ |
| | 17 | టిముత్తి | టముత్తి |
| 115 | 15,16 | కన్దరట | కన్దంట |
| | 22 | పసింతోలుక్ | పసితోలుక్ |
| 118 | 4 | నుంగురాకాసి | ను! గున్నేటిరాకాసి |
| 120 | 17 | ముంజదారికెనిం | ముంజదారికేనిం |
| 122 | 16 | దెపుల | దెపులు |
| 123 | 22,23 | మఱియట్టి కన్నకొమాళ్ళ నూఱ్వురకంటె | కొలముఁ బ్రోచెదు వేయికొడుకులకంటెను |
| 128 | 23 | పాలిస్నెంపు | పాలిపుస్నెంపు |
| 130 | 8 | నన్నయా | నన్నసా |
| 133 | 19 | బడఁజిల్లి | బడఁజల్లి |
| 134 | 20 | దోచ్ | దోఁచి |
| [illegible] | 13 | ముస్పెట్టె | ముస్పెట్ట |
| 141 | 7 | జయ్యాక్ | చాయక్ |
| | 12 | యేర్చి | యేర్చు |
| 147 | 10 | బాపనిత | బాఁపనత |
| | 15 | పొరట | పురఁటు |

| | | | |
|---|---|---|---|
| 152 | 15 | దనట్టు | దనపట్టు |
| | 23 | వెండిమియేటన్ | వెండియేమిటన్ |
| 156 | 17 | వైష్టవ | వైష్ణవ |
| | 23 | చతుథాన్ | చతుర్థా |
| 160 | 14 | నయన్వయిఁచు | నయ్యనన్వయిఁచు |
| 162 | 10 | వాఁడపుడు | వాఁడపుడు |
| 164 | 6 | బాగలు | బాగులు |
| 165 | 17 | క్రి | క్రిం |
| 171 | 6 | బాగలు | బాగులు |
| | 13 | కంద | కందు |
| 173 | 10 | కందన్ | కందున్ |
| 174 | 4 | కందను | కందును |
| 177 | 15 | హరిశంద్రుని | హరిశ్చంద్రుని |
| 181 | 11 | బుడతకు | బుడుతకు |
| 183 | 2 | నరతి | నరితి |
| 184 | 5 | తిరుమా | తిరమా |
| | 7 | కలయుం | కలయం |
| | 14 | కొడకవై | కొడుకవై |
| | 25 | ప్రొద్ధుబడి | ప్రొద్దుబడి |



—*శ్రీరస్తు.*—

# సత్యా విజయము.

## —*శుద్ధాంధ్రనిర్వచనకావ్యము.*—

### ప్రథమాశ్వాసము.

చ॥ సిరియునునీలయున్బుడమిసిబ్బితిచెల్వయుఁగొల్వమింటిత్రో।
వఱలుపరాకుఁదెల్పుఁదొలిపలుకులకున్నెలవైతిరంబునై।
పఱఁగెడివాఁడువీఁడెయనివాకొనవేల్పులుపాలవెల్లిపైఁ।
బెరిమఁబరుండిముజ్జగముఁబెంచెడిమాపెరుమాళ్ళనెంచెదన్॥ 1

చ॥ కలిగినవాఁడవా, యురవుగల్గిచెలంగితె, తొల్లినీకొలం।
బిలువడియేదియో, తెలియకించుకయున్ననుఁగన్నసంద్రుఁడి।
మ్ములననునీకొసంగితనమ్రోలనెడంబోకకొంతనీయఁబే।
ర్వాలసితివంచుఁదామగనివేఁడుకునాఁడెడులచ్చినెంచెదన్॥ 2

చ॥ కొలిపెడివింత! నెన్నుదుటఁగుత్తుకనగ్గివిసంబుఁగాంతువి।
బ్బలుసెగకెట్టులోర్చితనిపల్కెడుగుబ్బలికూఁతుఁగాంచిచ।
ల్వలరొడయండటుండవినువాఁకనుబల్వలిగట్టుపట్టిసే।
కలిమినివేంద్రమానెయని।కాలెడునెకొఁటికంటిన్మ్రొక్కెదన్॥ 3

కం॥ అలనాఁడు సవతి మెయిఁగల। కలువలువాఁడునని తేజఁగలిగింపర
హిన్। నెలఁదాల్చితీవయనిది। ల్వలదారిన్ గేరుగట్టుపట్టిన్ గొలు
తున్॥ 4

కం॥ తెలిదమ్మిది మ్మెగద్దియఁ। గొలువైమువ్వేల్పు వేల్పుగుబ్బలిదాల్పున్
నలుమొగములఁదొలిపలుకుల। కలిమిన్ దగఁబొగడుజన్నిగట్టున్
దలఁతున్॥ 5

ఉ॥ కూరిమిపట్టి! నీ వెలఁదికోటజికంబిఁకఁజాలు, మాటలన్।
జీరిబిటారిపాటెనసి చేపడుఁబల్గురినోళ్ళనంచులో।
వేరమునల్వకున్ దెలుపు వెన్నునియన్నవఁగాంచిచాలునీ।
తీరననాతరంబెయనిదెప్పెడివిద్దెలచాననెన్నెదన్॥ 6

చ॥ తరలకతల్లిమాటవినితజ్జవదాఁటితినంచుఁదండ్రియు।
ర్వ్వరకునుసూడుఁబూన్పనరువున్ గనియామెపటాణిసింగమై।
పరఁగఁగగౌరుమోమిడెనుబాపు రెనాకనిమిత్తిగొంగకున్।
గరముఁదలంకిమ్రొక్కు వెనకయ్యఁదలంచెదనిచ్చనిచ్చలున్॥ 7

సీ॥ ఎవ్వాఁడుచిన్నప్పుడెలమిఁబండనియెన్నినింగిమానికము వేమ్రింగ
ఁజూచె।ఎవ్వాఁడుతోవలరాయిడికాని చూలికిఁబడయనిబలునండ
నడరఁగూర్పె। ఎవ్వాఁడుమున్నీటినేటికాల్వగదాఁటి కడిమిసోఁ
కులప్రోలుఁగాల్చివచ్చె. ఎవ్వాఁడుతనకూర్మియేలికతమ్మునిమనుప
వేమందులమలను దెచ్చె। బలిమిఁబదిపదులంచులబాకునెవఁడు।
డీకొనియడంచిసోఁకులపోకఁగొట్టె। నట్టిజగజెట్టికరువలిపట్టినా
కుఁ। దోడునీడైసుకంబిచ్చుఁదోరముగను॥ 8

క॥ మినుకులఁదెలుపుచుముగితికి। మనుకువనెఱిదారిఁజూపిమతకపుఁ
దొగలన్। దునుముచువెన్నుఁడెవేల్పౌ। ననియెడురామానుజార్య
[illegible]॥

క॥ నిద్దంపు టెలుకఁ గనుప। న్నిద్దఱనాళ్వార్లఁ గొలిచి నెగడెడియల
మా। యద్దంకి తాతయార్యులఁ। దద్దయుఁ జెన్నారు భక్తిఁ దవిలిత
లంతున్॥ 10

ఉ॥ కోరికలూడ్పి లోపగలఁ గూల్చి గొనంబులఁ దోర్చి నిచ్చలే।
పారవెలుంగు పేరెలుక హాళిమదిన్ నెఱిఁ జేర్చి తానయై।
పేరిమి మీఱి తన్దలఁచి పేర్కొను వారికిఁ గోర్కెలీయనే।
ల్లారఁ జెలంగు నాతబిసి యుక్కరిఁ గొల్చెద షిర్డిసాహెబున్॥11

ఆ॥ కొలువుమీఁదఁ దొల్లి గోదావరి కడనే। లూరనుండ వేడ్క లూరనా
కుఁ। గయితలకన్నంబుఁ గఱపినయలనంది। రాజువీరరాజు రహిఁ
దలంతు॥ 12

క॥ మున్నుదెనుంగుఁ గయియాసరి। మిన్నల నన్నయ నెఱన్న మేటిల్లినతి।
కన్నను పోమనఁ దెలగన। నన్నువ మొల్లమ్మఁ దిమ్మయన్ మదిఁ దలఁ
తున్॥ 13

తే॥ ఇప్పటికయియాసరులమఱి మెప్పుఁగన్న। కందుకూరి వీరేశలింగము
నకెరఁగి। పార్వతీశ్వర శాస్త్రికిబత్తి నలిపి। మదిని వేంకటరత్నశ
ర్మను దలంతు॥ 14

క॥ చేరి పెనుగొండబడియయు। వారై నాకయితదిద్దవఱలించినయా।
నారణవరమిలు పేరిటి। శూరత్త్వాళ్వార్లమదినిఁ గోరి తలంతున్॥15

క॥ తెనుఁగుమఱి వేల్పుబాసయుఁ। బెనఁగొనఁగబ్బంబుఁ జెప్పఁబేర్కొ
నుటగునా?। తెనుఁగున్ గయితగ,। నచ్చపుఁ దెనుఁగునఁ గూర్చినను
గాకతీయనినుడులన్॥ 16

చ॥ ఇదివఱకెందఱో కయితలేర్పడఁబూని త్రిశంకుపట్టియు।
ప్పిదముగు సుద్దిఁ బల్వగల వేలుపుబాస పెనంగఁ దెల్లునన్।

సుమరుగఁజెప్పి రేనిపుడు మాఱ్పెదనచ్చ తెనుంగులోనని।
బ్బుదిగలయావజీరుకతఁబన్నిన నెన్నినఁబున్నె మేకదా॥ 17

తే॥ గీ॥ కబ్బమొనరింపనేర్పు నాకడను లేమి। తెలిసి తెలిసియు దొర
కొంటి దీని నేను। దొరహరిశ్చంద్రు నిజము నిబ్బరముఁగూర్చి।త
ప్పులుమ దియబ్బురంబుబ్బి తార్పఁదార్పు॥ 18

తే॥ ఇటుల వేల్పులకందఱకెఱిఁగియిత। జాణలకు మ్రొక్కిడి హరి
శ్చంద్రుకతను। "సత్యవిజయంబు" పేరిట సరవిఁజెప్పఁ। దొలు
తనెఱిఁగింతునిందు నాకొలము తెఱఁగు॥ 19

సీ॥ ఏవేల్పు వేల్పు మున్నిజగంబులకెల్ల యండమైమఱిఁగతంబై చెలం
గు। ఏవేల్పు వేల్పు రూపెన్నిక చెయ్వులఁదవిలియుఁదపులకతగుల
మొందు। ఏవేల్పు వేల్పు పేరావలిఁదొలఁగింపఁబడుబుమైఁబెక్కువే
సంబులందు। ఏవేల్పు వేల్పు పెల్లేపారి పాలవేఁతరులనేతరులఁ
ద్రుంచియేలమినించు। నట్టివెన్నునియందంపుటజ్జదోయిఁ। బుట్టి
వినువాఁకచెలియతోఁబుట్టులగుచు। వఱలునాలవవారిలోఁవన్నె
వాసిఁ। గలిగిమొప్పారుకుమ్మరకొలమునందు॥ 20

సీ॥ ఎవ్వాఁడుతనతండ్రిమవ్వంపుబత్తి చేమినువెల్లిదాల్పు మెప్పునను
గలిగె। ఎవ్వాఁడుబతమందియొపుడుజక్కులఱేని చెలికానిప్రూజె
లసలిపినెగడె। ఎవ్వాఁడుతనబత్తినెఱుఁగజంగముమాడ్కివచ్చి
నముక్కంటినిచ్చఁదనిపె। ఎవ్వాఁడువంగడంబెసఁగఁగ్రొన్నెల
దారిచనువందితనచానసంతుఁబడసె।ఎవ్వడుజగంబులందుమిన్నె
టిదాల్పు। పాత్తమ్ములలోననెక్కుడుబత్తుఁడగుచుఁ బేరుఁబెంపు
మిగిలిఁజెప్పఁగాంచె। నట్టిగుండయ్యవంగసమందుఁబొదలి॥21

క॥ లలి "వట్టివేళ్ళ" యిలువడి। బలుకొనఁదొలిఁగొర్నెపాటివారన

మాపె। ద్దలువెలయఁగఁగొన్నితరం। బులుసననటఁగొండఱందుఁ
బొదలినబలిమిన్॥ 22

చ॥ అలవునసంపవిద్దెమెఱయన్ గడునేరిచియొందుఁబేరు వెం।
పులునుగరంబుమేటిలినప్రోలగునయ్యనకోటఁజొచ్చియు।
మ్ములయిలవవ్విలాతిదొరమ్రోలనుజూపిననాఁటఁగోలెపే।
రలవడనింటిపేరుబిరుదందిరి "యయ్యనకోట" వారనన్॥ 23

తే॥ ఆయయనకోటకొలమున నలరఁబాల। కడలిఁబుట్టిన రేవల్లుకరణిఁ
బైఁడి। వలువదాలుపుకూరిమివలనఁబొడమి। తనరెఁదిరుమలసె
ట్టియాతనికినంత॥ 24

తే॥ పుట్టెపెంపొందెనరసింహసెట్టియతఁడు। కూర్మిమంగమఁబెండ్లియై
కొలమునెగడఁ। జేయుచెన్నయ్యమఱినరసింహుఁగాంచి। యం
తజకీర్తినిగాఁగమంగమ్మచనిన॥ 25

సీ॥ చెలఁగియానరసింహసెట్టియచ్చమనంతఁ జేకొనితిరుమలసెట్టిమ
ఱియు। వేంకటసెట్టినివెనుకవీరాసామిసెట్టినిఁగాంచనాదిట్టలం
దుఁ। దొలుతటివాఁడయియలరినతిరుమలసెట్టిలక్ష్మమ్మనుజెట్టబట్టి।
పెరుమాళ్ళసెట్టినప్పిదప రామస్వామిసెట్టిఁబడంపడిఁజెలువుమె
ఱయ॥ పార్థసారధిసెట్టినాఁబరఁగునన్నుఁ। బడయఁగానేనుమును
జెన్నపట్టణమునఁ। బుట్టియును వెనర్కనెల్లూరబుద్ధితెలిసి। తెనుఁ
గుఁజదివియింగ్లీషునఁదేఱికొంత॥ 26

తే॥ పిదపదొరతనపున్ వారివెజ్జుబడినిఁ। జదివియటవెజ్జనైకొల్వునుది
రితడవుఁ। దెనుఁగువడనాటనెల్లనుదిరిగియిపుడు। కృష్ణరాయలపె
నుగొండనెసఁగువాఁడ॥ 27

సీ॥ ఏవేల్పుతుదమొదలెట్టివిన్నాణులకైననిట్టట్టననలవికాదు। ఏమే

టిబొజ్జలోనిజ్జగంబులువుట్టిపోనరిమాయనునీటిబుగ్గలట్లు। పదం
టఁగూర్చిలోనిచ్ఛలూఁకిచి మేయిదాల్పరుల్ తబుసుమైఁదగుదుఃఖా
రిమ। పదిట్టతఱిఁబేరనెడమునఁదలఁపునఁ గొనమునఁజిక్కికకొఱ
లుసతము॥ ఎజ్జగాప్రోడగిఱికొనియిజ్జగంబు। తా నెయ్యై వెండియొ
ల్లచెయ్దుంబులకును। సాకిరిగమీఱిమాఱుపు లేకయెపుడు। వెలయు
నోయట్టినిజమైనవేలుపునకు॥ 28

క॥ తలఁపూనిపసిఁడికడుపున్। వలఁతిన్ బుట్టించి తొంటిపలుకులనె
ల్లన్। దెలియంగఁగఱపిజగములఁ। గలిగింపఁగనాననిడినకఱివే
ల్పునకున్॥ 29

క॥తుంటవిలుతుఁగాంచినజగ।జంటకునొంటమినిఁబగఱఁజమపలకోరి।
మంటన్ గెంటినదంటకు।బంటజగావలఁతిపాలిపంటకుదొరకున్॥30

క॥ చెట్టలఁదబుసులకున్ వెతఁ। బెట్టినరాకాసిమట్టు వెట్టినగారా। జె
ట్టికిగాధియనుంగున్। బట్టికిమదివచ్చురాచబలుబొట్టియకున్॥31

క॥ గుజ్జైవేడబమునమూ। డజ్జలయొడమడిగిబలినినడఁగించిపోరిన్। ము
జ్జగముఁగొన్నవేలుపు। టొజ్జకుఁగొలతెవులుఁదొలఁచునురువెజ్జు
నకున్॥ 32

క॥ బలుచిలువపాన్పుగఱువకుఁ। భలు వేసములందిబలిమిఁబలువలనని
లో। నలిపినవలంతివలఁతికిఁ। దొలిచదువులగనికిఁగొలలఁదోలె
డుధణికిన్॥ 33

తే॥ అప్పనంబుగనానేర్చునట్టుకరము। నెందుజగములవెలయఁగానే
నొనర్పఁగడఁగుసీసత్యవిజయమన్గబ్బమునకు। నెరుపడినట్టికత తె
లంగెట్టులనిన॥ 34

క॥ వలనుడిగినెత్తమునదా। యలకోడిసిరుల్ దొలంగియాలరియైతే। మ్ములతోడనడవికంగదఁ। దొలఁకుచువిచ్చేసిగొంతితొలిచూలియ టన్॥ 35

సీ॥ కమ్మతెమ్మెరలవెన్కకుముందటికినూఁగువలఁతిప్రమాఁకులబారులల లుగాఁగ। నచ్చబచ్చటఁగొమ్మలందువిచ్చినపూలగుమురులునురు గుముత్తములుగాఁగ। నెడనెడఁగుప్పలైపడినపుప్పొడిచెంతనెసఁ గెడియిసుకతిన్నియలుగాఁగ।క్రొవ్విరితేనియల్ గ్రోలిమ్రోసెడు తేంట్లసందడితరఁగలసద్దుగాఁగ॥ కరముఁజెలువారుతబిసిరాక న్నెపిండు। నిగ్గుపగడంపుఁదీఁగెలజగ్గుగాఁగఁ। దనరిమున్నీటిసొబ గొప్పుద్వైతవనముఁ।జొచ్చిజముపట్టియటఁదటిఁబుచ్చుచుండ॥36

సీ॥ వెలిబూదతిగరేకలలఁది నెన్నుదుటనుడంబుమైమెయిబసుమంబు మెత్తి। నిడుదకెంజడగుంపునడినెత్తిఁగీలించి। పులికళాసమువల్వ మొలనమర్చి। జగజంపుఁబటికంపుసరముఁగేల్గవనందియెదనిండ రుదురాకపదుగుఁదాల్చి। తెలిరంగులీనుజందియములసవరించి చే తమోమగయూఁతలాతమూని। మినుకుకొనలందునేర్పడుమేటి వేల్పు। సతముఁదలఁచుచురెండవజగమువిందు। చందముననిండు తేజునజమునికొమరుఁ।గదియఁజనుదెంచెఁదబిసిమృకండుపట్టి।37

క॥ చనుదెంచినజడదారిం। గనుఁగొనితమ్ములునుఁదానుఁగడువడినెదు రం। జనిసాగిలిపడిపూజెలఁదనుపుచుఁదోడ్కొనుచుఁదెచ్చితనరి నబత్తిన్॥ 38

ఆ॥ దబ్బతలిమమొండుఁదడయకతెప్పించి। యందుఁదబిసినునిచియం డనిలిచి। సేమమడిగికొంతసేపటికటఁగొంతి। తొలికొమారుఁడి ట్టులఁబలికెనోదిఁగి॥ 39

క॥ ముత్తిలిపైఁజొత్తెంచిన। మిత్తిన్ డాకాలమొత్తిమినుసిగదొరఁబెం
పెత్తునఁబోలినవాఁడవు। ముత్తాతవునీవుతబిసి ముత్తంబునకున్॥ 40

గీ॥ ఇటులమీరుచూడనెందఱురాజులు। గడచిచనిరొమఱిజగంబుతె
న్ని। మార్గువెల్లిఁగ్రుంకిమడఁగెనొమీరించు। గననిపుడమికితలుగ
లవెతబిసి॥ 41

క॥ ఒడయలలోమునుబుడమియు। విడిముడిరాణువయుసిరులవిడియు
డుములఁజే। డ్పుడిమగుడదొరతనంబున్। గడిమిన్ గనివెలయు
వాఁడుగలఁడెజగాన్॥ 42

క॥ అనియడుగుపాండుకొమరుని। గనుఁగొనజడదారిమిన్నగనికర
మెడఁదన్। గనియిటులనుడువఁదొడఁగెన్। దనివిహరిశ్చంద్రుసు
ద్దిఁదఱుఁగనివేడ్కన్॥ 43

క॥ పుడమికిఁబాపటబొట్టై। యొడపకముగితినిడుప్రోళ్ళనేడిఁటఁదొలి
దై। కడలివెలందికినీడనఁ। బడుసరయువుదరినయోధ్యపరఁగుజగా
న్॥ 44

క॥ అగడితఁగనిసంద్రంబని। దిగిగ్రుంకునొయనుచుఁదమ్మితెగచెలికిని
జం। బొగినెఱఁగింపఁగఁజనెనన। ఁదగుమైనవ్వీటికోటఁదాఁకుం
జదలున్॥ 45

తే॥ కోటప్రకఱాలరతనాలగుమినగ్తుఁ। గలమొసళ్ళైరలంచుమెకఱుం
గఁదొలఁచఁగ్రిందఁజాఱినఁజిల్వవెలందులంది। తాల్తురినేఁటికినిద
మతలలవాని॥ 46

చ॥ అలరనగ్తనీటఁదమిహత్తికొలంబుమునుంగఁజూచిపె।
ద్దలలనిగట్టునూడలిగిమారొఱనరాన,టగొరులంతనీ।

ర్వలుచగఁబిల్చితొండములఁ బై కెగఁజిమ్మినసీటిబొట్లుమ।
ల్కలబలెనాల వేల్పుదొరకున్ మెఱుఁగిల్లులుమీఱెఁగన్నులై 47

చ॥ పొడవయికుందనంపుఁబనిఁబొల్పగు మేడలుమిన్నుముట్టఁబో।
నెడమిఁక లేదటంచు నెలయీఁగుచుసోరణగండ్లదూరియే।
గెడుతజీవంటయిండ్లఁబొగఁగీడ్పడికందెనుగాదటన్నఁబా।
ల్కడలియనుంగుఁబట్టి కెటుకల్గెనునప్పెదఁజూడుసుట్టుగన్॥ 48

కం॥ కొలలువిడివడఁబుచ్చిన। నేలసుత్రాలకయి పోవనేర్చినవాఁజిఁ
బోలుపఁగవచ్చునించుక। వాలాయంబచటి వారువంబులకువ
డిన్॥ 49

సీ॥ మినుకులమునికినాఁదనరుకల్వాలదాయ పగలుసేసెడివాని తగవ
దెంత। చదువులకుదురునాఁజనునల్వతలగొట్ల మారినూతని తె
ల్విసారదెంత। విద్దెల మేటినా వెలయు వేలుపుటొజ్జ మోటొక
ప్పుడువానిమాటదెంత। సుడుల నేర్పరి దివ్వెయొడయండు రెండు
నాల్కలుగలాఁడతనినికరంబదెంత॥ యనుచుఁబలుకుదురప్పీటి
నలరునేల। వేలుపులునిండు తేజునఁగ్రాలి మొదలి। పలుకుగసువం
పుజాణలై తెలివికలిమి। నఱలినికరంపుఁబ్రోడలై వాసికెక్కి॥ 50

సీ॥ పుడమిదాల్పులుగానిపుడమిదాల్పులుగారు వేలుపుదొరకళ్లనే
లఁగూల। నెఱసరిగమిగానినెఱసరిగమిగాదు గొబలదాఁగుచు
నార్చిగొడఁగుచుండు। వాఁగుమిన్నలుగాని వాఁగుమిన్నలుగారు
వడినెత్తములజాతికడలిఁగలయు। బలిమిరాగుమిగానిబలిమిరాగు
మిగాదు పసుకులగుట్టలఁబడిచెలంగ॥ ఁగడిమివిలువిద్దెచేవయుఁ
గలిగియెలమి। మరములనుమించిపగతుఱఁదొడరిమూఁగి। పించ
మడఁచెడు వారలప్పీటనుండు। రాయసముమీఱిమెలఁగెడురాచ
వారు॥ 51

తే॥ కొలిచి తొలిబిచ్చపుఁ వేల్పుఁ గొంత సొమ్ము। నడిగి తా నొకఱొ
కఱంపు టూడయుఁ డయ్యె। ననుచు రారాజు నలఁతిగ నాడు నచటి।
కోమటులు కల్మి గొలుచులఁ గొఱలుచుంద్రు॥ 52

గీ॥ పక్కి నెఱ రౌతు నసుగుల బత్తిఁ గలిగి। నెగడి నాఁగేటి దారి బల్లగ వె
ఱెంగి। పాడిపంటల జెలఁగి మైవడి మెలంగి। వఱలుదురు కాఁపులట
మిన్నవాఁక కరణి॥ 53

సీ॥ కొమ్మలో పూవిల్తునమ్ములో చెలువంపు గుమ్మలో యపరంజి బొమ్మలో
కొఱ। ఇంతులో చెలువపూబంతులో నాడెంపు దొంతులో వేల్పు
పడంతులో కొఱ। కన్నెలో వలరాచ తిన్నెలో క్రొమ్మించు వన్నె
లో నెత్తావి గిన్నెలో కొఱ। ప్రోడలో వలపించు వాడలో వెలలేని
మాడలో పసిఁడి క్రొన్నీడలో కొఱ॥ వెలఁదులో లేక తమి నింపు కొ
లఁదులో కొఱ। పొలఁతులో లేక మిసిమించు వలఁతులో కొఱ। య
నఁ జెలంగు దురవ్వీడ నలరుఁ బోండ్లు॥ 54

సీ॥ తన ప్రియసంబను నంచకును ముజ్జగం బెంచ రహిఁ బెంచ నొక పంజరం
బు గాఁగ। తనలావు మగఁటిమి తగ రౌతున కెల్ల కాని రా రాపించు
కానగాఁగ। తన ప్రియవిము న్నిటికి నివిన్న పఱత పైఁ గొట్టిన యలని
టి బొట్టుగాఁగ। తనపలుకుఱ పలుకు పైడలికి నిబువియెల్ల తగ నిల్వని
కఱంపు జగము గాఁగ॥ పొడి నేమంబులకు నాటపట్టుగాఁగ। వెలసి
వెన్ను నివలకన్న కొలము కడలి। నిండు జాబిల్లి యైతుద కొండదనుక।
ఁ గ్రాలు నేల హరిశ్చంద్రుఁ డేలెఁ గడిమి॥ 55

సీ॥ క్రొన్నెల నెమ్మోము వెన్నెల నగవులు తెఱగంటి బువ్వవాల్ తెఱలచ
వులు। పాపరాజడ యుఁగ ప్రఁబుబలుకుఱ లతీరు క్రొమ్ముల గొలుపల్లు
దురు సొరుల్ తెలిదమ్మి కన్గవ వలము రికుత్తుక వేలుపు ప్రమాంది వ కేలు

దోయి। వెలిగొండసిబ్బెంపువలిగబ్బిగుబ్బలు చదలేటితరఁగలచా
లుతరులు॥ సింగపుంగౌను తెలిగారుచేయితొడలు। చుక్కలబెడం
గుగోళ్ళు పెంపెక్కఁజేని। యసముపిరిబోణిమెఱసిరాయంచన
డల। మొనసిచెరలాడుచున్నదిముజ్జగాన॥ 56

తే॥ ముజ్జగంబులెఱుంగఁగనిజ్జగాన।దొల్లినేలినమగమూఁడుబల్లిదం
పు। దొరలలోననితండెన్నఁదొంటివాఁడు। బలిమిగలవాఁడుని
క్కపుంబ్రతినవాఁడు॥ 57

క॥ అద్దొరముద్దియక్రొత్తడి। పెద్దలమిన్నయయికలిమివిరిబోణిజగా।
యుద్దియయిచంద్రమతియన। ఁదద్దయుఁజెలువారుమగనిఁదవిలిన
బత్తిన్॥ 58

క॥ అయ్యిరువురకుంగలుముల। తొయ్యలికిన్బక్కరౌతుదొరకున్నన
విల్। జియ్యలలిఁబొడమినట్టుల। నొయ్యనలోహితుఁడుగలిగెనొ
ఱపరియగుచున్॥ 59

కం॥ తొలిదెసవజీరుకొల్వున। ఁగలవేలుపుటొజ్జఁబోలి క్రాలఁగనా
క। ల్వలసూడుకొలముదొరకడ। నలరారున్సత్యకీర్తియటఁబ్రె
గ్గడయై॥ 60

సీ॥ పరుసఁదనంబెన్నఁబడఁతులపాలిండ్ల వెలయవేటిమిపొలయలుక
లంపు। లేమిడిమిసిమించులేమలకౌనులగాటంపుఁబెనఁకువకూట
ములను।కలఁతయెక్కుడులోఁతుకొలఁకులమడుఁగులనెత్తమ్ములొ
గిఁగొండమొత్తములను।విన్నఁదనంబనివెనుదీయుపగఱయందోట
మివాఁకలనొలయునీళ్ళఁ॥ గానియొండెడనించుకేఁగలుగనిక్క క
డిమినెఱపాడికలిమినిఁబుడమినేలెఁ। దడవువినువ్వానికింబునంగ
డపురాచ। చందురుండుహరిశ్చంద్రుఁడందముగను॥ 61

ఉ॥ ఒక్కఁడుఁబచ్చకాల్పసిమిపొలుపొన్నపొలు రంగుతులంగలింపనొం।
డొక్కఁడుఁగప్పుకాల్మిసిమిమొప్పినమొప్పఁగఁగ్లుసుప్పవే।
ఱొకఁడుమాలకాలఁజిగిమొద్దికనెండలునిండఁజేయని।
ట్లొకఁడుటమిన్నమిన్నలకునిఁగఁగ్రాలెడునట్టికొల్వునన్॥ 62

సీ॥ ఒకచాయపిన్నాణి లొరిమఁబ్రాఁబలుకులఁ దేటతెల్లమిగాఁగఁ
దెలియఁబలుక। నొకయోరగుదెదాల్పు సెకవేల్పు మొదలుగాఁ
గలదెసయేలికల్ బలిసికొలువ।నొకపజ్జఘల్లనియుదిరిగజ్జెలుమ్రో
యఁదపిలియచ్చరలునట్టువలుసలుప। నొకచెంతఁగుమిగొనియొ
లసిక్రికఁలుగెల్పుగద్దలనెలుఁగెత్తికరముఁజాటఁ॥బుడుకుమ్రాన్న
ననెత్తావు లొలయఁగన్న। తెమ్మెరలువీవఁదలఁపురాయెమ్మెగద్దె
ఁగెలుగెందమ్మిమూలకావాలుమెఱయ। వేలుపులఱేఁడువెలసెఁ
జేరోలగమున॥ 63

గీ॥ అట్టికొల్వునఁదనరితానచటమూఁగి। యున్నతబుసులఁగనియిట్టులువి
న్నవించె। ముజ్జగంబులెఱింగినయొజ్జలీరు। గానమీకెందుఁదెలి
యనికతలుగలవె॥ 64

చ॥ కడచినవారిలోనిపుడుగన్గినవారలలోనలేకముం।
బొడమెడువారిలోఁబలికిబొంకనియేలికముజ్జగాననే।
యెడ్డనఁగలండెవిననింపగుపల్కులనానతిండునా।
వుడునటవారలట్టియుఱిప్రోడయెవండనియెంచితోఁచమిన్॥ 65

గీ॥ వినివిననితీరువారుఁబైఁగనెడివారు। మగుడనానతిండనువారుమ
ఱుఁగువారుఁ। బెద్దలెఱిఁగింతురనువారుఁబెడమొగంబు। గలుగు
వారైరికొండఱాకొలువులోన॥ 66

గీ॥ కొండఱెఱఁగియునేలొకోయుండఱూర। కుండుటదిగాదువేల్పు

రాయొడయఁడిప్పు। డాడినది వేఱటంచెంచియవలియివలి। వా
రిగుసగుసనడుగు వారైరిమఱియు॥ 67

గీ॥ తెలుపనేరకచ్యవనుండు దెసలుగాంచె। నింగిఁగనెనత్రిజమదగ్నినీ
ళ్ళునమలె। వామదేవుండు నేలపై వ్రాయుచుండె। తేవఁదలపో
యఁగఁడఁగెఁగౌండిన్యుఁడెడఁద॥ 68

సీ॥ అప్పుడు లేనవ్వుననిదిండిజడదారి పలుకుఁడంచుఁబులస్త్యుఁబలుక
రించె। నతఁడుముందరనున్నహరితుఁగనుంగొనెనతఁడగస్త్యుఁడు
గలండనుచునుడివె।నతఁడుజైమినివంకనారసికనుగీఁటెనతఁడుభ
రద్వాజునడుగుఁడనియె। నతఁడుమున్నరిగికశ్యపుఁజేరి మెయిగోఁ
కెనతఁడుకణ్వుఁడుదెల్పుననుచుఁజూపె॥ నిటులజడదారులెల్లరీ
వీవటంచు। నొండొరులుదారుగన్గొనుచుండనపుడు। గొలువుదీరిన
తెఱఁగంటివలఁతిఁగాంచి। పలికెనిట్లువసిష్ఠుండుకలతెఱంగు॥ 69

క॥ వినుమో వేల్పువజీరా। వినుకెంపుకొలంబుకడలివెన్నెలఱేఁడై।
తనరారుహరిశ్చంద్రుం। డనుదిట్టయయోధ్యకొడయఁడగుచుజగా
న్॥ 70

గీ॥ అతఁడీరేడుజగములనాడిబొంక। నట్టిమన్నీఁడువెండియుగట్టిదిట్ట।
డెసలనిండినయసముచేనెసఁగువాఁడు। నెఱిగొనంబులప్రోకక్రొ
న్నెనరువాఁక॥ 71

గీ॥ అనినగాధిపట్టిగినిసిపేరుఱుమున। కట్టెసింగమార్చినట్టుచమరు।
బిట్టువడఁకఁదబిసిదిట్టవసిష్ఠుని। గాంచిపలికెనిటులఁగఱకునుడు
ల॥ 72

క॥ ఏలాయీతెఱఁగుననీ। వేలుపుదొరకొల్వునందు వినదబ్బఱలన్।
బాలసుఁడవగుచుఁబలికెద। వాలముగదదొరలునిజమ్ములాడుమెర
నుటల్॥ 73

క॥ తినిమ త్రిలియనయముజ। వ్వానులణ దమిఁదగిలివలపువలలకులో
నై। మనుదొరలకునిజ మెకర్ఁ డ। పనిమాలివసిష్ఠయిటులఁబలెర్ఁ
దవేలా॥ 74

క॥ కనియుణ గానకవినియుణ। వినకయ పెఱవారి కెగ్గు వెసఁ జేసిపొ
రణ। గని నేలమనిర్ఁ సతమని। పొనరా రెడుపుడమి దాలుపులుని
జమరు లే॥ 75

గీ॥ రాచవా రేడనిజ మేడ్రత్రాఁచులకును। మేలుగానముండు నేనీవుమి
కుర్ఁటముగ। ఁదెలిసినట్లుల వేల్పు రాదిట్ట్రమోల। ఁజిగురునకుఁజే
వయిడుమాడిర్ఁ ఁజెప్పెదింత॥ 76

గీ॥ పొలువతనమాఁగివినుతల్లిపుట్టినిల్లు। మేనమామకుఁ దెలియదా మే
టిరాచ। వాఁడనైదొరతనమదివట్టిదనుచు। ఁదొలఁచిపొఱుఁడయి
ననాకుఁ దెలియకు న్నె॥ 77

క॥ అనవుఁడువసిష్ఠుఁడంతట। ఁగనుఁగొనిమోగాధిపట్టికర్జంబున కె।
కర్ఁ నిమాటలాడఁగడఁగెతి। గొనకొనునీసొజమైనగొనమదిమొక
దా॥ 78

క॥ తెలిసిననదిగాదనియుట। ఁబలువురు మెచ్చంగఁ దెలియఁబలుకఁగ
వలెఁగా।కలుకణదొలఁకణగలఁకణ।బలుకణదగవగు నెతబిసిబా
గరివందుణ॥ 79

కం॥ పెఱిగితివితబునుకలిమిణ। వఱలితివలనలువసవతు వాఁడవటం
చుణ। మెఱసితివి నెఱుకనకటా। తొఱఁగఁగ లేవైతికొనకుదొసఁ
గనుకినుకణ॥ 80

గీ॥ అనుమునగాదిమాలియజ్జడదారివ। సిష్ఠుఁగాంచికనులుజేవురింప।
ఁబలి కేనిటులనొరిపొ్రైమొఱింగిన। వానిఁబోలిమిగులవద రెదిచ
టం॥ 81

క॥ "ఎఱుఁగంగ "వట్టుగొడ్డున। కఱవులు మెండ" నఁగఁదబుసులందొ
ఱునిచోటన్। గొఱలఁదెగవ్రానియుత్తఱి। మొఱకుఁదనంబునను బ
ల్కు మొనసితి వేలా॥ 82

క॥ నెలజోడుకొలఁపుటోడయల। కిలునొజ్జవుగాన వారికిచ్చకములనీ।
కొలువుననుడివెదుబట్టున్। బలెఁబొగడుచు నే నెఱుంగువారలు
గారే॥ 83

క॥ కలఁడే నిజమరియనిలో। దలఁచుచు నెఱతబుసులుండఁ దఱుసలివ
గుచున్। "బిలువని పేరంటము" నాఁ। బలుకఁగనీ కేలతగవు బాసి
వసిష్ఠా॥ 84

క॥ నిన్నెవ్వరైనమిన్నగ। నెన్నియుటన్ దెలియఁబలుకరేయనిమిగు
లన్। మన్నించినారె వేలుపు। మన్నియకడఁదగునె యిట్టిమాట
లువలుకన్॥ 85

గీ॥ సరెయొకప్పుడు తబిసిరాసకియకోడ। కానికింపగుఁగానిమ్ముప్రా
నినీవు। వలికిన తెఱఁగు వెండియుఁ గొలువునందు। దక్కఁగలవా
రికద్దియితంబుగాదు॥ 86

క॥ అనవుఁడు వసిష్ఠుఁడంతటఁ। గనలుచు నలగాధిపట్టిఁ గనుఁగొని యోరీ।
వినరానిరజ్జులీయెడఁ। గొనకొనిపలెక్కఁదవదేఁ కొంచెతనానన్॥ 87

గీ॥ గిబ్బఱంకెకుఁ దలఁకు నే బొబ్బమెకము। వినుమునీ యాఁర్పులకు నేను
వెఱచువాఁడ। గానుమిన్నక చెనఁటి వైకయ్యమునకు। గాలు
ద్రవ్వెద వేటికి గాధిపట్టి॥ 88

ఉ॥ ఎక్కఁడుకినుకఁబూని వెరవించుకఁగానక పోసరంబునన్।
నిక్కుచు నార్వ్యజంకుమనె నేను దలంపఁగ జాతిబొమ్మకా।
చక్కిలిగింతలీతబిసి చందురులీయెడ నేవగింపనీ।

విక్కరణిన్ బిసాళితనమేర్పడఁ బ్రేలెద వేలకాఱులన్॥ 89

చ॥ గరుడునికీడెపిచ్చుకలుగానవుగాకలహెచ్చుతక్కువల్।
చొరవతనాననసిగ్గువిడిపోటికవీడ్వడఁబల్కుటొక్కటే।
యరయనెఱుంగుదీవువినుమా తెలియంగఁద్రిశంకుపట్టితో।
సరియొక యీఁడువచ్చునెనిజంబునఁబాడినిముజ్జగంబులన్॥ 90

సీ॥ ఆహరిశ్చంద్రు నీవిట్టులలఁతిఁజేసి। పలికినంతనెనీకేమివచ్చె హె
చ్చు। వెండితగ్గనెయాతనిదండియశము। కొనకునినునీవెఱింగిం
చికొంటివిపుడు॥ 91

క॥ కల్లైనబొంకియెఱుఁగని। వలఁతిహరిశ్చంద్రుదూఱఁబాడియెనీ
కున్। దలఁచితివో వానిఁబుడిమిన్। గలయొడయలనొకనిఁగాఁగ
గాధేయయనన్॥ 92

చ॥ ఒఱటుతనంబునన్మిగులనుక్కవమూనిపరాకుసేసిప
ల్లఱపులువల్కినంతనెతలంగుదురేయిటనెవ్వరైనన
న్నెఱుఁగవెయోవసిష్ఠచదలేటిమగండునువెన్నుఁడున్గడున్।
వెఱతురుగాదెనాతబుసుపెద్దఱికంబునకించుఁబల్కుడున్॥ 93

సీ॥ నగవులాటలుమీఱితగవులాటలకెక్కి రనవీరుపోరికిమొనసిరిపు
డు। చనుటమేలనిదండఁదనరారువిన్నాణి కెసగంగఁగనుగీఁటెరు
సియొకండు। తడయరాదిందనిజడదారియొక్కండు జింకతోలు
విదిర్చి చంకఁబెట్టె। మనకేలయింటుండననిలేయనొకకేల నూ
నెనూఁతగలాతమొక్కతబిసి॥ వచ్చెదరెమీరటంచటఁబజ్జవారిఁ।
జీరికకపాలనిడెనిరాబారియొకఁడు। పొదఁడుపొదఁడింకఁజూచి
వచ్చెదమటంచుఁ। గొందఱాగనిల్చిరటమౌనపుంమనీంద్రు॥ 94

సీ॥ అనుహరిశ్చంద్రుండెయానౌనునిజమరి కొఱలడింకెవ్వఁడంచుఁగొం
దఱంద్రు। కనుఁడువసిష్ఠుండుగలసుద్దిఁదెలిపినఁగూడె వేరమటం

చుఁ గొండఱందు। ఎప్పుడుముక్కునఁ గినుకయీగాధిపట్టికిఁ జెం
దఁ డోరుపఱచుఁ గొండఱందు। తెఱగంటిదొరమాట తెఱఁగెద్దివీ
రాడుకొను కెద్దివినుఁడంచుఁ గొండఱందు॥ లేరె? తగవూనియిట
వీరిపోరుదీర్చ। సందియముమాన్ప వారంచుఁ గొండఱందు। ఁజమ
రుగూడినవిన్నాణిచదురలిటుల। నొండొరులతోడననుకొనుచుం
డిరపుడు॥ 95

గీ॥ వెండిగాధికొమారుండుగండుమిగిలి। తీండ్రమాకినక్రూచూడ్కులు
వేంద్రమెనయఁ। బండ్లుపటపటఁగొఱికియేర్పడఁగాంచి। కరు
సులడరవసిష్ఠుతోఁదరకటించి॥ 96

సీ॥ పుడమినంతయుఁదనతోడమీఁదదాల్చిన జడదారి మేటికశ్యపుఁడ
టుండ। కడలినంతయునొక్కపుడిసిటఁగైకొన్న పరఁటిపుట్టువుని
రాబారియుండ। అలగట్టుదాయమేన్గలుగు లేర్పడఁదిట్టి దట్టించిన
ట్టిగౌతముఁడటుండ। బటువుఁగైదువజోముఁబాటింపకఱకాలఁబిట్టు
దన్నినమేటిభృగువటుండ॥ నుద్దపిడివేల్పుపెద్దపెన్నుద్దియనఁగఁ।
దద్దయునుమీఱినేనుండఁదక్కనట్టి। దండిజడదారులుండనీదుండ
గంపు। టుబుసుపోకలునీకేటికోవసిష్ఠ॥ 97

క॥ ఈమాయందఱకంటెన్। గామిడివాయేలమించిగఱువంబలెనా।
గాములుదలఁపకపలికితి। వామేటికినింతనీకునోరవసిష్ఠా॥ 98

క॥ నెలదారియానమెయిదా। ల్పులఁజిల్వలఁదొంటి వేలుపుల వేల్పుల
లో। గలుగఁడునిజమరియొక్కఁడు। గలయఁగ వెదకిననుముజ్జగం
బులననుడున్॥ 99

మ॥ పెఱవారిన్ గడులొచ్చుగాఁగనుటకీవింమీఱితందానిబల్।
గఱువంగ్గాఁదగవింకవాకొనుటలేకర్జంబుదానంగొలల్।

సీ॥ మింటిప్రోల్చందంబుమీఱులాగున మేటితెఱఁగంటిదంటలతఱచుఁ
గలిగి। నిక్కంపుజగమున్నియనవ్వకైవడిఁదోరంపురాయంచ
దొరలఁజెలఁగి। పాలసంద్రముబాగునోలిగేరెడుమాడ్కి వలమురి
వలఁతులకలిమిఁదనరి। కలిమిపైదలిచూలివిలుపొల్పుపోలికఁదమ్మి
పూసరులయందమ్ముఁబొనరి। కమ్మవలిగాడ్పుసోఁకుల గలఁగున
లల। ఁగ్రాలుపుత్తడికలువయుయ్యేలలూఁగు। జమిలముక్కాలిగో
లలకొమరుమీఱె। యలరుతెలినీటికొలనొండుకెలనఁగాంచి॥ 132

గీ॥ తూలితిమినేఁడు పుష్పాడిప్రాలిబిట్టు। సోలితిమిత్రోవజవ్వాదిజా
లుపీఁది। యలయికదొలంగనిఁకనింపుజలకమాడి। చనుదమనియా
కొలఁకువమునిఁగివారు॥ 133

గీ॥ తడుపులూడిచివలిపైపావడలుదాల్చి। వాలునెఱులార్చికొనఁజి
క్కువాయఁదీర్చి। కీలుగంటులనమరించిక్రాలుగంట్లు। దొరహరి
శ్చంద్రుడాయఁబోవెరవునెంచి॥ 134

సీ॥ జాంబిల్లిమినుఁబ్రాకుచందంబు రహిఁదోఁపనుగజాలబిళ్ళలసిగలఁ
దాల్చి। యేనుంగుతలలసుప్పాణులొప్పఁటఁజూపఁజనుకట్ల[illegible]త్తెం
పుసరులఁబూని। పగడంపుఁదీవెలుచిగురుదార్చైననంగఁగ్రాలుసెల్ల
వలఁజేకట్లమర్చి। చెందొవపిండునంగందంత నెఱిఁగింపఁజూచి
మోములనుగస్తురినిదిద్ది॥ మలలమొయిలులకలిమిఁజన్నులుసుదార్పు।
నీలిహొంబట్టుకంచెలనోలిఁదొడఁగి। బెడఁగుబలుమానికంబుల
తొడవులంది। రాణవెల్వాడిమరునిపటాణులనఁగ॥ 135

మంగళమహాశ్రీవృత్తము॥ జోలికగనవ్విసురపాన్నఁగనుసన్నలనుబొ
ట్టుగులఁదన్నులనువేఁగం। గేలినుడిగొఁగులనుగేలినుమిఁగ్రొంబొ
గడఁగేలు నిశిమావులనుబాటఁ। గ్రాలుచవిమోరటులఁగౌఁగిలి

నిగ్గోరఁటులఁగట్టులుకసంపఁగులనూర్పుల్ । బోలవిడివాపిలినిఁబూ
లనలరించినవబోఁటులు సారంగులలరంగన్॥ 136

సీ॥ కాఁగిలిసుగమెట్లుకనుఁగొనెనీక్రోవియంద నెట్లాండెనోహోళిమా
వి। కంగేలియెటువిరుల్ గైకొనెదనుఁదన్నునగనెట్లుకాంచెఁగ్రొ
న్ననలుపొన్న। కినియనెట్లలరులగెనసెనీసంపంగికనినబోట్టుగదెట్లున
నిచెఁబొంగి। ప్రేంకడంబెట్లుతాఁబెంపొందెనును బాటఁబూలనోఁ
గెట్లుతాఁబొదలెమాట। ఎవ్వహానివాపిలిగలిర్చె నెలమినూర్చ।
యెటులఁబూచెనోపొగడతా నెమ్మెనుమ్మి। చూడవింతగనివియును
గోడెతనము।జాడలెటెఁగినకొమ్మలచవినిడెలుపు॥ 137

క॥ అనుచున్ బులుఁగులవినుచున్। గనుచున్ దీవియలననుచుకసుమొ
గ్గలఁజే। కొనుచున్ ననబంతులమూ। రొనుచున్ దరిరెమ్మలందు
కొనుచున్ జనుచున్॥ 138

చ॥ కొమ్మలనొంచిజొంపములఁగొంతవడిన్నిమురించినీటనె।
త్తమ్ములముంచిమేలువలితావులచొప్పలరించినింపునీ।
రమ్ములఁబొంచిక్రొవ్విరులురాలఁగఁదీవెలవంచిపూమవా।
రమ్ములమించితావులడరన్ముదలించిగడించియించులన్॥ 139

ఉ॥ జాణతనాననిట్లలరుచాయలనేగుచుమ్రోలనిప్పపూఁ।
దేనెలుసోనవైకురియఁదేఁకువఁగన్లానికోరెలూరఁగా।
నానుదమంచుఁజూసియరఁటాకులదొన్నెలఁబన్నికేల్గవన్।
బూనికరంబునమ్మదురుపున్దని వారఁగఁగ్రోలుపూనికన్॥ 140

సీ॥ సిరిప్రోడకిదియింతచేకూఱమిన్ దానుదొట్టియుఁబలుమాఱుపుట్టి
గిట్టె। మాకరంటికివియింతచిక్కమిఁదానిండు మ్రగతెనంబందక
యగడువడియె। నలువకునిదియింతగలుగమిఁదానెప్పుడొడిఁగితొ

ల్లుమకఁ ద్రైపదిరివదిరె। ఁదొంగతేనికిదియింతదొరకమిఁదా నెప్పు
డగిలిమై తెగులునఁదగిలినొగిలె॥ మఱియుననవింటితుంటరిమంట
నటుట। లడలితొలిచిల్వపుట్టుగ్రుడ్డగుటలిట్టి। కడిఁదివిరితేనెయబ్బ
మికతనఁగాదె। యనుచు నెకుఁడుసంబరంబుననుబొదలి॥ 141

క॥ మననోఁచునోముకలిమిన్। గనఁగలిగితిమిందునిట్టికడునబ్బురమా।
ననదీరు చవులుదవులన్। దనివిన్ద్రా వెదమటంచుఁ దలిరుంబోఁ
డుల్॥ 142

క॥ దొప్పలఁదొలకాడఁగన। ప్పప్పంపున్మంపు నీరుఁబూరించిచ
వుల్। చొప్పడరఁగ్రోలిమత్తున। ముప్పిరిగొనికొంతవడికిమూరిన
తెలివిన్॥ 143

సీ॥ చిలుకలాకావుక్రొంబలుకుల నెఱివిసంబొలికెడు మరుహురుమా
మొలకలివ్వి। తేఁటులాకావునోనాటఁజక్కెర విల్తుపాటిజాకె
డునాటబోటులివ్వి। ఇగురులాకావుబల్ పొగరులావ్రానినచిగురు
డాల్దారమంచుడగరలివ్వి। చెఱకులాకావుసైనఱకులాడెడిప్రా
వుఁగఱకువాల్మన్నియమొఱకలివ్వి। యనుచులాహిరివిటతంబాడు
కొనుచు। బచ్చఱెక్కలపులుఁగులఁబాఱఁజేసి। తుమ్మెదలరోసితలి
రులఁమనియఁగోసి। కనులప్రామఁకులఁగడద్రోసికదలిమఱియు॥ 144

చ॥ వలినెలఱాలఁగ్రాలిచెలువంబగుతావులఁబ్రాలుమాలిచెం।
గొలనులనీరుఁగ్రోలిమొలగోవెలమూఁకలఁదోలిబాళినై।
నలరులప్రాలితెమ్మెరలహోవళికెంతయుఁ దూలిపల్లుక్రొం।
జిలుకలకోలిసోలిమరుచిలుకలప్రామాలివిరాళిఁదేలుచున్॥ 145

క॥ జడదారిగాధికొమరుఁడు। నుడివినతొలియానవాలునూ లొక
సు నెడమా। పడఁతులుడగ్గఱిబెడఁగున్। దొడవులఁగ్గసేసికట్టి
దొట్టినజిగితోన్॥ 146

సీ॥ నెఱివ్రేలుపెంజడల్ పిఱుఁదగల వెన్నాడ నెఱులంటిక్రొవ్విరుల్ నె
త్తమాడ। కొలుకులను నునుగాటుకల రేకలడరంగ బెళుకువాల్చూపు
తూపులు సెలంగ। నాణికమ్మలు చెక్కుటద్దములఁ దలిర్ప నొసలముం
గురులు గ్రొమ్మిసిమి గూర్ప। వలుదగుబ్బలు కంచెలలఁ బిక్కటిలఁ జే
యఁ దోరంపుసరులు చన్దోయి రాయఁ। గ్రందు మొలనూలు గంటలు
సందడింప। డంబుమైనందియలు మొరపంబుఁ బెంప। మేనముత్తి
గరతనముల్ జానునింప। మంపాలయ నేగుదెంచి యమ్మదటదో
యి॥ 147

సీ॥ చిలుకపలుమాజోడుఁ జెనకు చెల్వము వానిఁ దలిరు జవ్వనము చేనల
రువాని। నలసుటామని గోమునదలింపఁగలవాని జగమెల్లవలపిం
పఁజాలువాని। తొగవిందు నిండు సోయగము మీఱినవాని దోలు కా
డు చెలువంబు కలిమివాని। రారాజు కొమరుమై రాణమించినవాని
నెనలేని తేజు చే నెనయువానిఁ। దళుకునిద్దంపుఁ జెక్కులగులుకువా
ని। మొలకలెత్తెడు చిఱునవ్వులొలుకువాని। జానుమీఱినజిగిహరి
శ్చంద్రుడేని। గాంచియచ్చెలులబ్రమ్మగదుర నెదుర॥ 148

ఉ॥ తమ్ములఁ దెన్నునౌ గనువితమ్ము మొగమ్ముఁ గరమ్ముఁ బెన్నెఱుల్।
తుమ్మెదదిమ్ము పైగమిచి దొమ్మికి రమ్మను నెమ్మె లొమ్ముచిం।
దమ్ములవమ్ము నిర్చి మెడదమ్మునఁ బొమ్మను గౌను జిమ్ముసిం।
గమ్ములనమ్మచెల్ల మొడికమ్ములయిమ్ముగు వీఁడు కొమ్మరో॥ 149

క॥ చక్కెరలూరునౌ వాతెఱ। చెక్కుళ్ళద్దంపురవలు చెక్కినయిక్కల్।
చక్కదనంబున వీఁడా। చక్కెరవిలు తేని నెక్కసక్కెంబాడునౌ॥ 150

క॥ అనిమది వారిరుపురు నా। మిను కెంపుకొలంబు రాచ మేటి హరిశ్చం।
ద్రుని చెలువుఁ దలఁచి తమకం। బున నువ్విళ్ళూరఁ జేర్చ బోయి కడం
కౌ॥ 151

క॥ జేజేరామన్నీఁడా। జేజేజగదిల్ల తేజిజిగిగలువజగా। బాజున్ జె
నకుడనీఁడా। జేజేదిట్టంపుఁబెట్టు జేజేగట్టా॥ 152

క॥ నిగిడారునసము పేరిమి। తిగజగములనిండమించితివినినునీవిన్। ద
గవునఁదెసువన్ బోలిన। తగవరిలేఁడెందు రాచదావరిపుడమిన్ 153

క॥ మంటిమి గాణలమైమును। వింటిమినీకతల పెంపువిరివిగ రాము।
కల్గంటికో రెల్లలపంటవు। కంటిమినిను నేఁడుకనులకఱ వఱన
నుచున్॥ 154

సీ॥ గుబ్బకాయలుగబ్బిగుబ్బలపై రాయఁబసిఁడి వీణియలను బాదుకొ
ల్పి। గవిసెనలెడలించికరివెలుండఁగఁగాంచినిలిపిబైసణలఁదంతు
లనుగ్రుచ్చి। సుడిగోళ్ళఁదోలుతొల్తసుతిగొల్పియాలతి సరిగమప
దనిసస్వారము లెలయ। నెలుఁగెత్తినెమ్మిక్రొంబలుకుపెంపునరాయి
యలవడఁదీఁగెలనలవరించి। మ్రోళ్ళునన లెత్తనీరు మొయిళ్ళుహత్త
నాగులెడబాఱనంచలునక్కతాఱ। సోలిమెగములుపరఁగఁజక్రా
లుగరఁగ। తేఁడుమదిఁజొక్కఁజేడెలుపాడుటయును॥ 155

గీ॥ మాయురేయంచు తేఁడుబల్లాఱు వారి। పాటలకు మెచ్చిమంతిరిఁ
బజ్జఁగాంచి। తనివిదీరఁగ మేల్పసదనములిచ్చి। పసుపుమనుట
యుఁబెగ్గడవల్లెయనుచు॥ 156

క॥ బెడఁగున్ నగలను విలువన్। బొడవగుచీరలనుజింకపొక్కిలిఁబును
ఁగున్। దడయకొసంగిననొల్లక। యొడయనిదెసఁగనుచువార
లొత్తిలుచూడిక్కన్॥ 157

మ॥ ఇవిమాకేటికిరాచవేలుపుదొరా యీకాయుతీంద్రపువే।
సవియొండన్ బడిబిట్టుఁదూలితిమియజ్జల్ వోకెల్ల నెవ్వొమ్ములున్।
సొవదప్పెన్ గడుదప్పిఁజెందితిమిమాకొప్పింతపాటేఁచిమ।
క్షవదీఱంగనొసంగివెల్లగొడుగున్ గూర్మిన్ మమున్ బ్రోవుమీ 158

గీ॥ ఎల్లిదకఱఁగ వేఱొకఁటొల్లనయ్య। కనికరమ్మునమన్నించి క్రచ్చ
ఁదీర్చి। పసుపుమింకొండొసంగినవలదుదప్పి। నీరుచేఁగాకయా
ఋనేనేతివలన॥ 159

చ॥ అనవిని ఱేఁడువల్కెఁజెలులారయెఱుంగమినిప్పుడీరుకో।
రినదొసగంగఁగూడనిదిరిత్తతలంపులవేలనేలనా।
లననొనరించురాచనెఱలావరికయ్యదియుండుటొప్పఁగా।
వునఁదగవెంచియెండవడఁబుచ్చుమఱొకటివేఁడుఁడిచ్చెదన్॥ 160

గీ॥ అనుడువెలఁదులుమదినెంచియబ్బగాని। వీనికెమ్మోవిచకెఱరపా
నకంబుఁ। గ్రోలవెరవిదిగదయంచుఁగొనలుసాఁగు। సంతసపుఁజే
ర్మినాహరిశ్చంద్రుఁగాంచి॥ 161

ఉ॥ చిచ్చెగఁజల్లునెండవడసేదలనెవ్వహినేనిఁదేఱఁగా।
వచ్చునొకింతఱేఁడనునుఁబచ్చపులుంగువటారివాఁడిపూ।
గచ్చులుగ్రుచ్చిమైనొరసిగాడఁగఁజొచ్చెనుమోవిపానకం।
బిచ్చియలంతదీఱమమునేలుమునావుడుఁగినఱెంపునన్॥ 162

చ॥ అగునెవెలందులారమిమునర్మిలిఁజేరువఁదీయఁడాయఁగా।
వగలుబయల్పడన్గుసిసివైసికలేర్పడమత్తుఁగొన్నమై।
పొగరుననిట్లుప్రల్లదపుఁబోకలువోవుటలింకనిండ్లకున్।
మగుడుఁడటంచుఁబేరలుకమన్నియవెండియువారికిట్లనున్॥ 163

గీ॥ ఆటపాటలబయకొఱులనుచుఁదొలుతఁ। దలఁచితినయూరెయిప్పు
డాతలఁపుడిందెఁ। జూడమీయందునాసోదిజాడదోఁచు। వెడలు
డిఁకమిమ్మునన్నించివిడుతునిపుడు॥ 164

చ॥ నావుడునవ్వెలందులటనవ్వులువెన్నెలలల్లెఁగావినె।
మ్మోవుల్లునెంపుఁగుల్కెజిగిమోములుముద్దులుచిల్కమేనుగ్రొం।

దావుల మేలుదొలఁగనుదమ్ములజంకెనలొలఁజిలఁరా।
దావరిరౌతు చేఁదళుకుదారొఁనుముల్కులనంగబెళుఁచున్॥ 165

సీ॥ చెవులసొమ్ములఁగొంతసవరించు నెపమునఁ గ్రేఁగంటిచూడుఁలఁగీ
లుకొల్పి। యలరులముడువ వేనలినొత్తుపోలికమడిసందులబెడంగు
లడరఁజూపి। నుమటఁగస్తురిదిద్దుపదటునఁబరు వంపువలుదచన్నవ
పెంపువెలికినెఱపి। పొడము లేఁజెమటార్చువడువుననునుబైఁటవి
సరికొంచొడలిక్రొమ్మిసిమిదెలిపి॥ నెఱతనముజగ్గుతనమునునీటుఠీవి।
సిస్తుఁజెలువంబునొసపరిచిన్నెసొబగు।హావునానాకెంబుహొ
యలునొయ్యారమరువు।దోఁపనమ్మాలకన్నెలాదొరనుడాసి 166

చ॥ చిలుకపఠాణిజోదుగుఱ్ఱజికిఁగఁ గ్రొవ్విరివాఁడికోలలన్।
జలమునగాడనేయవెతసైపమిఁబూఁబొదరిండ్లనీడఁగా।
గిలిఁదమినిద్ద్రపోతువనికేరుచునీమఱుఁగొందనకఁటా।
తలపవొకింతమాసిలుగెదన్మమునివ్వగముంపఁబాడియే॥ 167

క॥ అనదలముకరము వెడవిల్తునిదళములఁజికిఁనొవ్వఁదొడరెడుక్రొం
బూ। మొనఁదలమెమనఁగదొరపే। రొఁనుదళపున్గూర్మిబ్రోవఁ
గూడదెమమ్మున్॥ 168

గీ॥ కనలువలవంతడాయరాఁగనులజూడ। వింతమొల్లిదనైతిమేమేము
నీకు। వలచితముదామెవచ్చినవాలుఁగంట్లు। పాటియుట్టిదిగదయం
చుఁబలికిమఱియు॥ 169

క॥ గులుకులుమవ్వపునగవున్। మొలకలుమఱినొండొకళ్ళమురిపెపు
బలుకుల్। దొలుకాడఁగలికిడంటలు। దలఁకకయవ్వలకుమిగిలిత
ఱుసలులగుచున్॥ 170

క॥ చనువందినవహిఁజెలులా। మనసరిమనసరియటంచుమన్నియ
లాయన్। గనరాయంతరువనిలోఁ। గనరాఁచక తేఁడు వారిఁ
గనుఁగొనిపలికెన్॥ 171

క॥ మాలగొనంబులవిడువక। హాలెముఁబ్రేలెదరెయరుసుఁడరుగని
యెడమీ। నాలికలన్ జీలికలన్। వాలికచురిఁజేసిమిమ్ముప్రవచ్చెనద
నుచున్॥ 172

ఉ॥ మంతిరిఁగాంచిపల్కె వెలిమాదిగ్రైచనునీపడంతులా।
వంతయునళ్కు లేకగదియన్ వెర వేఁకిపిసాళ్ళిఱాఁగ్రై।
క్రంతలకెక్కి సొమ్మనినఁగ్రమ్మఱ కెంతయుమట్టుమీఱిరీ।
జంతలవేఁదొలంచుమనఁజయ్యనఁబ్రెగ్గడడాసివారలన్॥ 173

క॥ కనుమినుదెలియకగడుసుం। దనమునదొరఁదఱియమీసుఁదగవాప
దఁడం। చనికినుకెవ్వడుదార్పఁగఁ। దనచేచబుకునను వారిద
ట్టినవాలోన్॥ 174

క॥ కనుఁగొనియకర్కటికముమది। ఁదనరఁగనెలజోడుకొలపుదణితన
హేజీ। బునుసత్యకీర్తిఁగారా। దనిమఱలిచిచబుకువట్టియాఁచు
చుమఱియున్॥ 175

క॥ తగవాయివ్వగనలుకన్।దగిలినమదిఁజెలులునొవ్వ దట్టింపఁగనో।
ప్రెగడమఱితెగువవగటున్। బగతురపైఁజూపుటొప్పుబల్లిదుల
కెటన్॥ 176

క॥ కఱచితివిపాడివెరవుల। మఱచితివావానినేఁడుమూర్తురటంచున్।
జఱచితివాతెఱవలఁమదఁ। బఱచితివరువున్ గలంచి పడఁతుల
నకటా॥ 177

పట్టుంజొచ్చి మెగంబులన్నిటిని జావంబుచ్చి పోకంతటన్।
బెట్టుంగోరిన నాకొమారితలఁగూ పెట్టంగఁ గొట్టించితే॥ 190

క॥ అడుగొకటె కాదు నొచ్చెడి। నొడలెల్లన్ రాచవెడఁగ యొప్పింపని
నీ। యొడుపరితనమున కెంతయుఁ। గడునుడికెడు నెడఁదనిన్నుఁగ
న్గొననాకున్॥ 191

క॥ తలఁపులు విసమున్ జిలుకున్। బలుకులు దీపాలుకుడుకుపాటిల్లెడు
నీ। ములుచదనంబిటఁ దెలిపితి। కలఁడే నినుఁబోలు ఠవరకాఁడిఁకఁ బు
డమిన్॥ 192

చ॥ కడిఁది మెకంబులుండు బలుకానలు లేవె మునీంద్రు వేఁటకున్।
దొడిబడి పోరెయేపుడిగి తోరపు మోనమె పొమ్మునిమ్ముగాఁ।
దడవుగడించి మించు జడదారుల మేల్తబుసుంగలంపని।
వ్వాడువునఁ జొచ్చి రేతబిసి పట్లనకిట్లు మెకాల వ్రచ్చిరే॥ 193

క॥ గోలలఁగని మూఁజస్నీ। కేలాగున నాలుకాడె నెలనాగలకు। య్యా
లింపక కటచబుకులఁ దూలింపఁగ జేతు లెట్లు తోడయ్యెనొకో॥ 194

క॥ విడిముడి యొడయలు ముడుతురు। కుడుతురు కట్టుదురు కడిమిఁ గ్రొ
వ్వినఁబగఱన్। బొడుతురు గాకీవడువున। నడవుల జడదారులడల
నడరుమ రెకటా॥ 195

చ॥ ఇదియదనంచు నీ మొనలు హెచ్చి కుఱంగటఁ బూలచెట్లువో।
విదిలిఁచి యొండకడ్డముగ విప్పుగుజోగుల యూకుటికఱెలన్।
బొదలఁగలంచి యండఁజిఱు బోదలఁ బోలి మెలంగు జింకలన్।
ధుదిపిరి యేఁడ యేఁడెటులొకో ల్చెడు వారును నల్లకారొకో॥ 196

శా॥ ఏమీ రాచయ్యలంతి నన్ననితొ నీయిల్వొచ్చి పేరామితల్లీ।
వేమాఱుందిని చందురుండవు భళీ విన్వేల్పురా యేఁడవం।

చామెకఁ గడువాయిదో యిడినినిన్నఁగ్గించి మేలొ ౘదిమై।
యామురఁ బీడనియావసిష్ఠునిగనీయాలంబునేఁ గాంచెదన్॥ 197

ఉ॥ మెట్టనొకింతక్రొంబసిఁడిమిట్టదిటంబజిమ్రంగుహైసరే।
కట్టలుకన్ గనుంగొనజగంబులుబిట్టునడంగు వేలుపున్।
దిట్టలుఁదిట్టలైతబిసితిట్టులఁబుంగుము మేమెయంచుఁగా।
పెట్టుమరోరినాబలిమి పెంపు నెఱుంగ వెకల్మిక్రొవ్వునన్॥ 198

క॥ వెంటంబొంటినసరెకద। కంటసమునసంటవచ్చికంటిన్ బలువే।
గంటిన్ముకఁ టిన్ వడిఁ। గెంటుము గడుఁదమ్మికంటి గెగలివడం
కన్॥ 199

చ॥ అనముదినొచ్చియాతబిసియాఁకర మేకరణింద్రోలంగఁగా।
ననువనిలోఁదలంచుదొరనారసిమంతిరివలెఁ నాకతం।
బునఁగదయింతలొటననబోణులుడాయఁదొలంచుమన్న నే।
ఁజెనకితి నేలవారిమదిచేడ్పడుగాఁడజిదప్పవచ్చినన్॥ 200

క॥ అని నెగులఁబొగలుపెగ్గడ। మనికితముఁ మాన్చితబిసిమదిచల్లన
పై। గనలుకొనియాడస్సైఁచఁడె। "మనివికిమచ్చరమె" యంచుమ
న్నెయుఁజెలియున్॥ 201

క॥ అయ్యాృమీరియ్యానువున। నెయ్యముబాటింపకలుకనింపునఁగనమే।
మెయ్యొడకుఁజనఁగ నేర్తుము। చయ్యనమముఁబోచు టొప్పుజడ
దారిదొరా॥ 202

క॥ వెసఁబూరిపోఁచఁద్రుంపఁగఁ। గసబెడలినక ఉకువాలుగావలెహో
మా। నిసియలఁతులమయ్యామీ। కసినలుతు మెవేల్పుఁదిగయుగలఁ
గియటుండన్॥ 203

గీ॥ ఎట్టిపగదారి నైనఁ దన్నేమనునుచుఁ। బ్రాపుఁ గాంచిన నో మేడుపా
డిఁగన్న। తఱుసు విన్నాణములీరలు తనకలులము। మఱుఁగుఁ జేరిన
వారము మనుపుఁడయ్య॥ 204

చ॥ అని జడదారి కాళ్ళఁ బడి యాదట నిబ్బరికంబు పెంపునన్।
మనుపరె యెప్పుడున్ గలవు మా యెడఁ దప్పులు దాపుఁ బ్రాపుగా।
గనుఁగొని మిమ్ము నమ్మితిమి కాదన నెయ్యెడఁ బోదు మింక నో।
జనమున ఱేఁడు గొట్ట మొగసాలకుఁ ద్రొక్కిఱ నవంత దీఱునే॥ 205

క॥ అని తడవు లేవకుండినఁ। గనుఁగొని జడదారి తాల్మి గనికరములు ఱోఁ।
బెనఁగొన ఱేనిన్ లేవఁగ। బనిచి మెయిన్ నిమిరి కలఁకఁ బాపుచు మ
ఱియున్॥ 206

క॥ యొడయని యడకువ విప్పున। కెడఁదన్ గడు మెచ్చి మెప్పు నెఱిఁగిం
పకకి। న్వాడిక నినీవొనరించిన। కొండి మెలనిఁ కనిందొ ముందొ కు
డిచెదవీవే॥ 207

గీ॥ జోతలిడ నెత్తు చేతులఁ జూచి చూచి। కోయఁ జేయాడ దది గాక కూ
డదలుక। తడవు చూ కెప్డుఁ గనికరంబడర నిన్నుఁ। గాచితిమి నీఁడ యొ
కమాటగలదు తెలుప॥ 208

క॥ ఈ నాకూఁతులఁ బూవున్। బోఁణులమరు వాలు దాలుఁ బోకార్చుజ
గా। జాణలఁ బాయపుఁ బలుకుం। గాణలఁ జేపట్టి కావఁగాఁ గగు
ననుడున్॥ 209

క॥ ఆకటిటతగవగు కర్జము। గ్రక్కునఁ బనిపిని యొనర్పఁ గాఁదగుఁ గా
కీ। వేకట సపుఁ జేఁత నూఁకొని। యొకట రణిన్ జేయఁ టొప్పునీరుసి
యూనన్ 210

క॥ అనుచు సంతోషించియా గాములరసి యేల। యున్నదున్నట్టు మోమో
టనోసరిల్లి। పలుకఁదగునంచు నానిరాబారిఁగాంచి। యీసడించి
ననుదిని తేఁడిటులఁబలికె॥ 211

గీ॥ పాలవంటకోలంబును నేలఁగలిపి। పాటిపెంపదితోడఁబడ నేటఁ
బుచ్చి। యంటఁగారాని యిమ్మాలయన్నదోయి। గైకొనుటయె
ట్లుతగవగు నాకునను డు॥ 212

క॥ కనలినఁ బాలుఁ గ్రోలరు। చనువునఁ బిసనైనఁ బజలు చవిగొందురటం।
చనువుగ నెఱంగియుంచుక। కనరెడలినయంబుఁ దెల్పఁగా నిట్లని
యెన్॥ 213

క॥ కనుఁగొనుము తేఁడ తగవిం। మనఁదలఁగ దుకల్మిఁగనె మిత్రోయ
కనాపం। పునపీరిఁ బెండిలిన్ గై। కొనుమా సందియము మానుకొను
మా వినుమా॥ 214

క॥ చెడఁగ బ్రతుకువారు పెక్కురు। పుడమిన్ గలరెందుఁగాని పొందలఁగ
మేలు। న్నడిపెడు వారరుదే యెడఁ। గడువడి నిచ్చెలుల వల దికనుఁ
గొనుమనసమున్॥ 215

క॥ పలుమాఱుఁ దగవు తగవని। పలికెదు దొరతనమె। బిత్తపాల్పడచుఁ
దుదన్। దెలియవిది మొదలనిను నే। కొలలందక యుండఁ బ్రోచి
కూర్చెదనెమ్మిన్॥ 216

చ॥ తలఁపవు తొల్లి నీ యనుఁగుఁ దండ్రిఁ ద్రిశంకుని బొందితోడమి।
న్నలవునకన్పియుంట నటు నిన్నును నా పలుకాలకించిరా।
పలుకహుమా వటారినన చిలుకలనందగు సేమిట్టారులన్।
వలచిన వేల్పు రాకలిమి పట్టునని ల్పెద తేఁడ నావుడున్॥ 217

గీ॥ ఘోర వేద్దరిద్రైజడదారికాని। కఱదుల దెసుముందేమి గాఁగఁగఁ

దో। కన్నకల నేఁడుచూడఁదారార్ణమవుట। కదనువడ్డైనెనఁగా
నున్నదగునటంచు॥ 218

గీ॥ తబిసియిన్మాలచేడెలఁదమినిఁదవిలి। పాడివిడికాంచు వేల్పు రావదవి
నేని। నొల్లవలసినరాకత్మినెల్లయిదిగో। విడుతు నెప్పుడుఁదగవు
నేవిడువననుడు॥ 219

ఉ॥ తప్పకుమింకఁబలుక నెలదాలుపు నానవజీరమాఁడెమున్।
విప్పగ నేలఁగామదియు వేడుక సేసెడిగానరాచపెం।
పప్పనసేసిపంచుపజలందఱుంగఁగ నానవాలుగా।
నిప్పుడునీసికాబటువునీయెడ వేగులకిచ్చినావుడున్॥ 220

క॥ భళినా కెంతటిపున్నెమొ। వెలయఁగజగములను వెల్లివిరిసినతబ
పున్। గలిమినినలువకు నెనర్మై। యొలసెడిమీబోఁటివారికిడుటిప్ప
గిదిన్॥ 221

గీ॥ ఐననాయుల్లమరయఁగానంటిరిట్లు। తడవు రాయజికంబుననడరి
విసిగి। వాయమిదియంచుఁదబుసుమైవఱిమఱల। దొరతనముఁజే
యనీయకొంమ రెతలంప॥ 222

క॥ అనవుడు మోమునఁజిఱునగ। వెనయఁగనాగాధిపట్టియేవహరి
శ్చం।ద్రునిఁగనుఁగొనినీయేతరి। తనమెంతయుఁ గానుపించెఁదద్ద
యునాకున్॥ 223

గీ॥ ఇపుడయిచ్చెదననివల్క యింతలోన। జాఱనాడఁగఁజను నెముజ్జగ
ములంమ।నాడితప్పనివాఁడవీవనుచు వింటి। ఁదెలిసెఁగద నేఁడు రా
చయీవుల తెఱంగు॥ 224

గీ॥ వింమనకుఁబిల్చికూర్చుండఁబెట్టిపిదపఁ। బిడచపిడచకువలయునా
కుడుపటంచు।నడిగియిడలేని వెడఁగుకైవడినిఁబిసిని। తన మొదవనె
న్నివగలాడేవపురములుచ॥ 225

ఉ॥ ఈయనటంచొ లేకపలుకీయెడఁదప్పితినంచొ రెంటనే।
దోయొకమాటనోటఁదెఱఁగొప్పఁగఁజెప్పినఁబో నెదీనికిన్।
మాయురెయిన్ని నేర్పులునుమార్పులు నేటికటన్నమున్నెయా।
నాయితమొందియున్నదొరకారయఁగాఁదనచానయిట్ల నేన్॥ 226

చ॥ తలఁగకయిప్పుడిత్తబిసి తాముదిఁగోరినమాడిక వేడ్క మై।
వలమురిదారికప్పనము వాటిలమన్నెఱికంబుసీపిగా।
నలవడనిమ్మిటన్ నలువయంతటివాఁడిటు చేయిఁజాఁచిరా।
కలిమికివాససేయనిడఁగల్గుటదెంతటిపున్నెమెన్నఁగన్॥ 227

క॥ సిరులిటఁదిరమా యొడలిది। తరతరములునిల్వ నేపదంపడిఁదము
త్తా। మరసియొనర్చినయీవియ। తిరమగుబలిశిబులవిరివి తేగము
వినవే॥ 228

ఛ॥ ఇదివఱ కెందటీపుడమి నేలిరొ వారెవ్వరైన వెంటఁబ।
న్నిదమున కేనిముంటి మొననిల్వఁగజాలినయంత నేల నేన్।
మదఁగొనిపోయి రేయసముదొట్టఁగనూనినవారిపాడియే।
కదసతమైజగంబునను గ్రాలెడునాఁదనలోన ఊఁడటన్॥ 229

గీ॥ ఏమినాకత్మియహాహాయియ్యంతితగవు। నాదు తెగువకు నెంతయుఁ
బ్రోదిసేసె। నిట్టియిల్లాండ్రఁజేపట్టినట్టివార। లెట్టిపున్నెంబు లేని
రాఁబట్టుటగుదె॥ 230

క॥ లలిఁదానొనర్చు సేఁతకు। నలరుచుఁబెఱతలఁపుమానియందలితగ
వున్। దిలకించి మెలఁగ నేర్చిన। వెలఁదుకగదవానిపాలి వేలుపుపు
డమిన్॥ 231

క॥ అనియిట్లుపలు తెఱంగులఁ। దనచెలిఁజంద్రమతి మెచ్చితబిసినిసిపిన్
దనుపనట్లుబసిఁడిబిందెలఁ। దొనకఁగఁదేఁబంచి శీఘ్రమ నెదారి
వెసన్॥ 232

ఉ॥ తానుఁబడంతియున్ దబుసుదావరిగాధికొమారుహజ్జలన్।
బూనికనీటిచేఁగడిగిపొంగెడుబత్తిఁదమంతనెత్తిపై।
నానెటనీరుఁజల్లుకొనియబ్బెఁగదాపొలివోనిబాగెమం।
చూనినవేడ్కలచ్చిదొరకొప్పనమంచునొసంగిరేల్పడిన్॥ 233

గీ॥ అపుడుకురిసిరితెలిగంటులలరుసోన। లచ్చరలునట్టువలుసల్పిరా
కసంపు। సీమఁబలుకులవెలఁదివసిష్ఠుపట్టు। గెలుచుననిపల్కెజగ
ములుదెలివినెసఁగె॥ 234

శా॥ ఆపైగాధికొమారుఁడేలుబడిఁజెల్వారంగఁదాఁగైకొనన్।
రేపేతెంచెదనంచుదీవెనలవారిన్దన్పిపుత్తెంచన।
త్తోఁపున్వెల్వడిప్రెగ్గడల్ మొనలుఁదోఁదోఁగొల్చివెన్నంటఁగాఁ।
డేపారన్గొడుకున్బడంతియునురానేగెన్వెసన్బ్రోలికిన్ 235

క॥ అనిమార్కండేయుఁడుచు। కర్ణనిమాటలవిన్నమానికపుమనుపుని
కిన్। వినిదినవవ్వాలికతయున్। వినిపింపుమటంచుఁదన్నువేవేఁడు
టయున్॥ 236

శా॥ అందంపుందెలిరంగులీరవళిచే నామింకితోల్వేలుపుల్।
క్రందంగొందలమొందిపిన్నైరవరుల్ రాణింపఁగాసంతసం।
బందంజేయఁగఁజాలిమజ్జగముఁజెన్నారన్నెఱాపాడిమే।
జ్జైందింపంగవలంతియాగావలమురింజేఁదాల్చుపెన్వేలుపా॥ 237

క॥ అలపిన్ననాఁడెసోఁకున్। నెలఁతుకఁబొరిఁగొన్నకవుడునెఱవ్రేమి
న్నా। ఎలపొన్నగున్నవ్రేతల। వలువలనిడికన్నడించివలచినయ
న్నా॥ 238

మత్తకోకిల॥ పాలసంద్రపునెప్పరిజిగిపైఁడిపుట్టపుఁజొప్పరీ। క్రాలు
బాములతకర్థరీయనిగండుఁజూపినయుకర్థరీ। యాలదూడలకా

పరిబదువైనగుబ్బలిమోపరి। యేలఁగాఁగలలావరి మదినేచుకో
రేఁలయీావరి॥ 239

గద్య॥ ఇదిశ్రీనీలకంఠేశ్వరాభిధపరమేశ్వరవర ప్రసాదసంభూత సకల కలాకుశలకులాలకులపారావారకళానిధిమండల మండనాయమానోర్వీమండలాఖండ సత్కీర్తివిభవమండిత గుండయశ్రేష్ఠినామార్యకులసంజాత శ్రీమద్వైష్ణవసిద్ధాంతోద్ధారకాద్దంకి తిరుమలతాతాచార్యవర్యశిష్యప్రశిష్యవట్టివేళ్ళగోత్రోద్భవ అయ్యనకోటతిరుమల శ్రేష్ఠితనూభవ ఆంగ్లేయభైషజ్యకర్మచాతురీధౌరేయసరస కవితానికాయవిద్వజ్జనవిధేయపార్థసారథి శ్రేష్ఠినామధేయప్రణీతంబైన శుద్ధాంధ్రనిర్వచన కావ్యంబునుసత్యవిజయనామాంకితంబునునగుహరిశ్చంద్రోపాఖ్యానంబునందు ద్వితీయాశ్వాసము॥



శ్రీ

## —*తృతీయాశ్వాసము*—

క॥ సిరులీనెడుప్రేంగంటన। గరమరయుచుజన్నిగట్టుకఅకులకోరిన।
బరిమార్చిసంతుంగనను। త్తరవేంకటింగాచిగొంటిం దనిపినవే
ల్పా॥ 1

క॥ వినువాంకయలలరవళికిం। బసువడుక్రొన్నెలుంగునుడులపన్నికవె
లయన్। వినిచెమ్మృకండునికొడుకి। య్యనువుననాగొంటిచూలికవ్వ
లికతయున్॥ 2

గీ॥ మఱునాండువడుగుగమితన। కుఱంగటందొలినుడులంజెప్పుకొను
చునురానె। త్తెఱంగుననేనిన్దొరద। బ్బఱంజేయంగదఱసెగాధి
పట్టియయోధ్యన్॥ 3

సీ॥ కలువసూడుగలంగంజిలువఱేండుదలంగందాంకుకోటలకగడ్తలను
నలరి। తావినింపునమ్రూలుతీవిపెంపునంగ్రాలు నలరుందోంటలకుం
జేటలనుమెచ్చి। బలిమిదాంపురమైనకలిమికాంపురమైన మొనల
కువీటివిప్పునకుంబొగడి। మిన్నుప్రోల్గ్రాగింజేరుహొజున్నడాల్నగి
గేరు నలవరినవరులకరిడింజెంది। చట్టుబురుజులపైనిదంచనలం
జూచి। సన్నమన్నెలదేరిజచాలుంగాంచి। వెడందసజ్జారములను
ముందడులనరసి। దొరనుడాయంగంబెక్కులోవరులంగడచి॥ 4

సీ॥ సూడిదలనుదెచ్చిచూడముందరంబెట్టి మైమోడ్పుచేన్వరిగాపులుం
డ్ర। కైకానుకలతోడ్డంగదిసికొల్వునఱేలు నడికట్టునసొకంతయెడ

మెలఁగ। జొచ్చికొల్చుమునీంద్రఁజూపియాయాయావిలాతులమన్నె
లనుచుమంతురులువలుక।అదనొనొకాదొకోయనుచుహజారంబు
నొద్దఁగొందఱువజీర్లొదిఁగియుండ। చమరుడెబ్బదిరెండుకర్ణంపు
వారు। గొలువఁగట్టికలెచ్చరికలనుదెలుప। గాధికొమరునిరాకఁ
జకర్లటిగవేది। యొగిహరిశ్చంద్రుఁడోలగంబుండనంత॥ 5

క॥ జడదారివచ్చుటాలోఁ। బొడగనియడఁకువయుబత్తిపొనరఁగఁదా
ము। న్వడినేగిమ్రొక్కులిడివే। ల్పుడుగావించుటయుగాధిబొట్టి
యవేడ్కన్॥ 6

క॥ రావేల్పవేల్పమేలగుఁ। గావుతఁగొదలేనియసముఁగల్మియుఁగలు
గున్। గావుతఁగోరికలలరుం। గావుతనని గెల్పుగల్గుఁగావుతనీ
కున్॥ 7

మ॥ అనిదీవించివజీరనీపలుకుమెప్పామాడ్కిరాకల్మిగొ।
బ్బునకాకీమొదనొప్పగించియిఁకనీప్రోల్వాసియుండెంమనేన్।
మనఁగన్నిల్వకపట్టినాలిఁగొనిపొమ్మాయన్నఁ డేఁడప్డుకొ।
ల్వునఁగాల్మన్నెలమంతులన్ గనిమదిన్ బొల్పొప్పఁదానిట్లనున్॥ 8

చ॥ వినుఁడువజీరులార నెఱపెద్దలార మునీంద్రులార వే।
డ్కనుమును వేటకైయరుగఁగానటనేల్బడి నెల్లఁ దేగమై।
మొనయఁగరంబుఁబల్కిబడినిజ్జడదారికిదారవోసి యొ।
ప్పనమొనరింతునేఁడిదిగొపాడిఁగనుంగొనుఁడంచుఁదానటన్॥ 9

సీ॥ బంఢారమిదివచ్చుబడిలెక్కలివివాలు సాలులీయవికణజంబులి
వ్వి। ఇవ్విపాగాలివ్వియేనుంగులివితేరు లివిపల్లకీచాలులివ్వినగ
లు। మొన్నలివ్విస్నెలలివ్విదొనలివ్విసతదీవి వజీరులంపుపావడము
లివ్వి।వేల్పుటెంకులనేలవేల్పులకట్టుబళ్ళెజగించు కడితంబులి

వ్వియనుచు। నన్నియునునొప్పగించిముందరసిపీరు। వెరవరులు
దళవాయులుప్రెగడలంచు। నానిరాబ్బారిమేటిరాతేనికెలుక। ప
ఱవియెల్లరఁగనుఁగొనిపలికెనిట్లు॥ 10

గీ॥ వీరిపనుపునబత్తిమైమీరలుంట। బుత్తిముత్తులరెంటికిఁబ్రోపుఁబ్రా
పు। వెరవరులుమీరలుంగనిసరవిగలదె। పోయివచ్చెదననవంతఁ
బొరలివారు॥ 11

గీ॥ క్రోలుబెబ్బులిబారికిఁగోదమలేళ్ళఁ। బంచువగమమ్మునీనిరాబారిదో
రను। నప్పగించెనెదొరకటాయనుఁగుఁదల్లి। యండబాసినపిల్లల
మగుదుమింక॥ 12

క॥ ఏలాయీజడదారికిఁ। బ్రోలేలెడుగోడవమొన్నమొన్నటిదనుకీ
నేలందానేలఁడ్డెమది। మాలెనొతనకిప్పుడగులుమరులాకొముది
మిన్॥ 13

గీ॥ కావివలువలొబూదియొకక్కపాలొ। జోగిపట్టియొలాతంబొసా
బగుజడలొ। పులికళాసంబొరుమరాకప్రోవొతబమొ। కాకతన
కేలరాచఱికంబుగోడవ॥ 14

చ॥ అనితమలోఁదలంచుకొనుచంగదనెలికఁగాంచియయ్యయో।
కనలెతబంబుగాగడనఁగాంచినయీరుసినోలగింపనె।
ట్లనువగునింతకింకఁదమయజ్జలప్రాపెడబాయుటెట్లుమ।
మ్మును వెను వెంటఁదోడుకొనిపొమ్మనతేఁడుగరంబునవ్వుచున్॥ 15

మ॥ తగవామీకిటువల్కనేఁబుడుకుచందంబొప్పరాలచ్చిఁజూ।
డఁగనొప్పించితినింక నాకిచటనుండన్ రామిఁబోఁజెల్లుఁజ।
ల్లగమీరెప్పటియట్లమేల్బదిమిగ్రాలన్ నిల్వుఁడీజోగ్గిమె।
ప్పుగమన్నించెడుబల్మికల్మితెవపెంపున్ గల్గమీకెప్పుడున్॥ 16

గీ॥ అంతలో నేఁడు ప్రోల్బ్యాయున నెడిసుద్ది। వాడవాడలవీడుల నాడు
లందు। వాఁగుటయువించునందందు వారుమూఁగి। కటకటంబడి
ఈనిచకఱ్ఱటిఁదలంచి॥ 17

చ॥ నడవడిగల్గువాఁడునుడి నాణెముఁదప్పనివాఁడు నాయము౯।
విడువనివాఁడు క్రొన్నెనరు వెల్లువయుల్లమువాఁడు రూపున౯।
బెడఁగగువాఁడు నేఁడహహ బీదలపాలిటివాఁడు నేఁడయో।
కడువడిఁగానకేగునఁట కన్గొనివచ్చెదమంచు నాపజల్॥ 18

గీ॥ ఇసుకఁజల్లినరాలక యెందుఁగిక్కఱ। అంచుగుములై హరిశ్చంద్రు
గాంచ మొనసి। మందిసందడిత్రోపుళ్ళముందుమించి। కొందఱొ
గిడాసి డెందంపుఁగొందలమున॥ 19

చ॥ అడుగులప్రాలి నేఁడమునకఱ్ఱటికంబున నేఁటిదాఁక నే।
గొడవలుఁ జెందనీకతమకూరిమిబిడ్డలచంద మొప్పఁబ్రే।
ముడిఁగని పెంచి ప్రోచితిరిపోయెద రేమముడించి నేఁడయో।
పసుపులఁదొట్టికానలకుబాపు రెమా తెఱఁగేమనందగు౯॥ 20

క॥ అనుచు హరిశ్చంద్రుఁడుతగు। ననువులనూరార్చి వారిననిచిని రా
జా। రినిగదిసి తనదుకొమతో। డనుకొమరునితోడ్రమొకిఱ్ఱడ౯గ
డుఁగనుక౯॥ 21

మ॥ భళిరామన్నెఱికంబు నెల్లవిడికువ్యాడంబు మైనందుపొ।
న్ములునైసేఁత నెపంబున౯ గొనివడి౯ బోఁజూచి తేయంచుఁజె।
ట్టలవాని౯ గొనికట్టుఁబుట్టములతోడ౯ బంపనేఁడేగుచో।
సెలవావచ్చెదనంచుమన్నెలకట౯ జెప్ప౯ వెత౯ వారలు౯॥ 22

గీ॥ కడిఁదిరాప్రోవుఁగడవఁగా నడచివాఁగు। దోనలఁబూనియొక్లేగు
దోయనినవిన్న। కడిఁదిరాప్రోవుఁగడవఁగానడచివాఁగు। దోనలఁ
బూని తెకదపాడితనకటంచు॥ 23

గీ॥ వెరవుపలుకులదొరవారివీడుకొంచుఁ। దలపొలంబంటిచనెడురా
వలఁతిఁగాంచి। పనుకుచునుగంటుఁబోఁగొట్టుకొనినవానిఁ। పగిదిఁ
గత్తఱమునగాధిపట్టియపుడు॥ 24

సీ॥ పులికళాసపువల్వ మొలనూడిడిగజాఱఁ జెమటమైమైబూదిచెమ్మ
గిల్ల। తలపైఁదెలిజన్నిదములుచింములుద్రొకఱఁ జేఁమాసిలా
తాపుఁజివ్వచికఱఁ। జంకిటఁగ్రైపాలసారెకుట్టటలూఁగ యొాగ
వాగలనజ్జలొత్తిగిల్లఁ। గేలజారిసీళ్ళుగ్రేఁటునఁదొనుకాడ వీడికెం
జడలుజీరాడనేల। నోటఁబ్రామినుఱతుదిమేటిమాటమఱచి। పరు
గిడుచునాహరిశ్చంద్రుఁడరుగుత్రోవ। కడ్డపడియొబిగాదినాకల్ల
నాఁడు। జన్నమునకిడ్డసొమ్మికచనఁగఁజనునె॥ 25

గీ॥ పనొకప్పుడుమఱచిననెఱుకపఱచి। సొత్తునీవలెఁగాకిట్లుచొరవచే
సి। యొరులముల్లెలముంచుటపరువెనీకు। నంచులోఁబోఱువానిద
య్యాదితలంప॥ 26

గీ॥ పాలఱడలిఁజిచ్చువోడమినపగిదినీవు। దచ్చికడలనుగీరితిపెచ్చు
గాంచి। పొనరుతొవసూడుకొలమునఁబుట్టితిపుడు। పాడిఁగాల్ప
గఁగడునగుబాటువోడమ॥ 27

క॥ వినవాపాఱునిసొత్తుగ। గొనఁజూచుటత్రాఁచుచెల్మిఁగోరుటెఱం
గా। ననఁగగిలుబాడనదిసం। పునునినునీకొలముమొదలుముట్టవి
సంబై॥ 28

చ॥ అనుడువలంతియేలుబడినంతయునిచ్చితినంతఁబోకకో।
రినమెయిసొమ్ములున్దగవురెకొఱనఁబెట్టితినింకమీరెఱుం।
గనితెలఁగొప్పనెయ్యొడమెఁగ్రైకొనఁగల్గితినింతలోనన్నైఁ।
దనరెడికట్టుబుట్టములుదకఱమతేమియులేదనాకడన్॥ 29

మ॥ మును నేనింతకు నాఁడుఁ జన్నమునకై పోలంగ నీకొన్న సొ।
మ్మునరన్ మీకిపుడిడ్డ రాపదవిలో నొప్పించితిన్ గాదె ప్రో।
దిని నన్నింకయు జన్నపున్నెలఁగ వేఁడెమ్మన్న నెంచుండితే।
త్తునిరా బారివలంతి మమ్మునికఁ దోడ్తోఁ గూర్మి వీడ్కొల్పుఁడీ॥ 30

ఉ॥ నావుడుఁ గాలుద్రొక్కువడు నాగువు బాగున జోగిరేఁగియా।
రా వెనుదీయ కీవు తొలి నచ్చిన సొమ్మొక వేయు పూన్కిఁ గా।
దే వెరవెంచి నేఁడిడిన యేల్బడినయ్యది సైతమిచ్చితం।
చావటి లంక బేరజములాడఁ దొడంగితి వంతకంతకున్॥ 31

ఉ॥ ఇంతను వేల్మికై పసిఁడి నీకొన లేదని యొక్క మాటయొ।
క్కింత బయల్పడన్ దెలుప నేగ నెనాకిట వాదులాడఁగాఁ।
బంత మెయిప్పజేని వెడపల్కులనో సరిపైకమిత్తునం।
చెంతయుఁ దొల్తఁ బల్కనని యేర్పడఁ జెప్పుము పోదు నావుడున్ 32

చ॥ పలికిన పల్కుఁ దప్పమనె బ్రాఁతిగఁ గల్గిన పాడిచందమున్।
దెలిపితిఁ గాక యింతటికిఁ దేఁకువ నాయము టంచు మీమదిన్।
దలఁపిడి నాఁటిరో నడుగఁ దప్పక ముప్పది నాళ్ళలోనని।
చ్చలముగఁ బ్రొద్దును న్నెలయు సాకిరులైకన నప్పగించెదన్॥ 33

గీ॥ గడువు వాయక తలను దాకట్టుఁ బెట్టి। నైన సొమ్మిత్తునటులనీ వైతినే
ని। చేవలంతిగ నేను నా చెలియు మీకుఁ। దక్కితిమి విల్వఁ గనుఁడేల
పెక్కులనుడు॥ 34

మ॥ గడువీ వాడిన యట్లుయిచ్చితిని పైకంబందనీ వెంటనె।
క్కడ నా కాఁదిరుగంగ నింకవినుమా కైకోలు రాణ్ణింపనా।
వడుగం డొక్కని వెంటఁ బుత్తునని క్రేవన్ గ్రాలు నక్షత్రకున్।
దుడుకుల్ బల్కి రిఁబిల్చి మున్ రవడిపద్దున్ దెల్పి తా వెండియున్॥35

క॥ ఎపుడిఁక నొక నెలగలవాఁడ। యఁడుతప్పక పైకమిచ్చె నా సరెయా
పైఁ। దడవా నరించిన తననుడి। బడిఁ దనుఁదన పడఁతిఁ బిలిచి పడయు
ముపసిఁడిన్॥ 36

చ॥ అనిమతి మోకతం బెనయ నావడుగున్ దరిఁజాయఁ జేరిపే।
నినిగనుఁగొంటె నీవిపుడు నెయ్యమిమై వెను వెంటనంటిదం।
దనఁబచరించి తాఁబలుకుఁదప్పు తెఱంగొన గూర్చిరమ్మహో।
మ్మని సెలవిచ్చియవ్వడు వునామనెదారికిఁ జూపిఁ బ్రేముడిన్॥ 37

క॥ వీఁడెపుడుఁ ద్రోవనడచిన। వాఁడింతకుఁగాఁడు వెంటఁబని పెదనీ
వె। వ్వాడికినాఁకలిదప్పుల। పోఁడిమిగ త్రైజేఁగి మనచి పుచ్చెదో
పీనిన్॥ 38

క॥ అనిమజియు నెంతొజాలిన్। గనిన తెఱంగపుడు దోఁపఁగా నటఁ జే
నిన్। గనుఁగొనియిత మెచ్చేఁగించెడి। యనువున నెనరుట్టిపడఁగ న
నెనీకరణిన్॥ 39

ఉ॥ ఈవిటువట్టివంతవడ నేలవటారముఁ బాయ నేలయ।
వగఁదెచ్చి పెట్టికొన నేల వెలార్చఁగ నేల ప్రోలమో।
పూవిలుకాని చేయుదిరి బొమ్మలఁ గొమ్మల నాకొమాత్రైలన్।
వావిరిఁ ద్రోయకీవు చెయివట్టిననీకిటఁ గల్గినింపనే॥ 40

మ॥ సరెనీకిచ్చ యొకప్డు వారిపయి వాసిన్ లేనిచోఁ బోనిప్రో।
ల్విరులేలా తెగబెట్టెదింత టికిఁ గాసిల్లంగ నాకేలమా।
టరహిన్ మన్నె మునిత్తు నంటిననితేటన్ జెప్పమున్నట్లురా।
చరికంబందఁగ నిప్పుడిత్తుననవోజన్ జేఁడు దానవ్వుచున్॥ 41

చ॥ దొరతనకూడినన్ బదవిద్రుమంగినఁ గాననికానలంపెన్నన్।
వరఁకులు పైపయిన్ బెరవిప్రాలిననం జెలితోడు వాసినన్।

బరువడిగూలినన్ గొమరుఁబట్టిఁదొలంగిననింతకీయొడల్ ।
దొరలఁగనున్న నాయసముదూలినదబ్బఱలాడనెన్నఁడేన్ ॥ 42

క॥ నాపుణ్యాధికొమారుం। డావిను కెంపున్ గొలంపుటరుసుదిటం
పున్। దావలముఁగూర్చియెంతేఁ। దావెఱఁగంచుచును బ్రతినద
ప్పెడినాకోఱ॥ 43

ఉ॥ బాపురెయంచుముకుఱపయిఁబాయకవ్రేలిడియారయేనుదా।
దాపుగనెల్లరాదొరలఁదప్పక కాంచితిముజ్జగాననెం।
దీపదిలంపుఁబట్టుఁగలయేలికఁగన్గొననైనపీనిఁబె।
ట్లేఁపులబెట్టికానినిజమేర్పడనారయరాదటంచుఁదాన్॥ 44

గీ॥ వెసహరిశ్చంద్రమవిడొఱల్పివీడుసొచ్చి। సరవినెఱపాడిదొరతనంబ
రయనచటవెరవరులనిల్పిప్రోలుఁదావెడలితనము। పట్టునెకొఱల్ప
ఘేనివెంబడిమొఱంగి॥ 45

సీ॥ బిట్టొండగాయవేవెల్గుఁగట్టడజేసి వడగొట్టగాడ్పుదేవరనుబంపి।
యడవినేర్చఁగఁగిత్తియొడయనినెసవెట్టి రకఱసీంద్రనుగంటఁజి
కఱగదిమి।చొరరానిదట్టమావిరివికొనలఁదీర్చి గండుమెకాలందు
గ్రాలనెఱపి। తఱచునయ్యెయ్యెడఁజఱులుండవెరవెంచిమినుము
ట్టఁగలగట్లనినుమడించి॥ మడుగుదొరవులఁద్రాగనీర్పుడిసెఁడేని। లే
కయొండించియాఁకటిలివనలంగ। మెసవఁగాఁగాయపండులవిస
మొనర్చి। యొన్నిగలవొవెతల్త్రోవనన్నివన్ని॥ 46

గీ॥ పలిమైనిట్టుదెసలెనయించితబిసి। గఱువావెన్నాడుటయుఖేఁదుద
అలసీని। దండిదిటమొందికార్పట్టుఁదఱియఁజొచ్చి। పిఱుదఁజ
న్నచంద్రమతిపంతమఱపఁదలఁచి॥ 47

సీ॥ కడిమిరావులుదండనడరనుంటిమి కానఁగడిమిరావులుదండనడ
రఁగలిగె। నెత్తమ్ములదలిర్ప నేర్పియుంటిమి కాన నెత్తమ్ములఁదలిర్ప
నేర్పుగలిగె। వేగులుగనుసన్న వెలయనుంటిమి కాన, వేఁగులుగను
సన్న వెలయఁగలిగె। లేఁకలుదరిఁగ్రాలఫీఁకనుంటిమి కాన లేకలుద
రిఁగ్రాలవీకగలిగెఁ॥ గం టెపైపదలిమాన్నెటికంబుపదవిఁ। దొలఁ
గివచ్చియునయ్యదిగలిగెమాగుడ। ననుచు నేరుపుఁబలుకులననుఁగు
ఁజెలియ। నడజడిదొలంగనడజడినుడిపిమాఱెయు॥ 48

సీ॥ తోడుగులూరఁదొలంగివెడలివచ్చియు నింపుఁదోడుగులుమాగుడఁ
గన్పడఁగనయ్యె। నెక్కుడుమావులనెడసెరాఁగన్గియు నెక్కుడు
మావులెయ్యెడనుదోఁచె। పడగదారులనాఁడువాసియె తెంచియుఁ
బడగదారులనేఁడుప్రబలుటయ్యె। చిఱుతఁగానక పెద్దతటికొకఱ
రునిఁగంటిమిందెన్నిచిఱుతలోయెన్నయ్యె। రాఁగలుగు మేలుకీళ్ళ
వ్వావోఁగడంక। నోహటించినఁబోవు నేమో నెలంత। యనుచునద
నునకగు నేర్పుటరువు లెఱిఁగి। పలుకుచటఁద్రోవబడలికఁదొలఁచి
ముందు॥ 49

క॥ వేఁగుచునడవిఁ వేసఁగిఁ। గ్రాఁగుచుబిట్టెండసెగలఁగార్పొదల
దరిఁ। లోఁగుచుమీఁగుచు నేగుచు। మ్రాఁగుచుసాగుచుఁగరంబు
మ్రాలుచు నెమటఁ॥ 50

క॥ మ్రోఁగుచునొరసెడివెదురుల। నాఁగుచునడజడినిఁగాల్వ లగు
మై చెమటఁ। దోఁగుచుఁదొట్టినవెతలఁ। డాఁగుచు వెనుజిక్క
ననుఁగుఁదొయ్యలిఁగనుచుఁ॥ 51

సీ॥ కొడుకునా చేఁదెమ్ముపడుకులీచేరమ్మనడు కాన బడలి శేనాతిమిన్న
చఱియలెయ్యెడఁగొండ నెఱియలయ్యెడనుండదఱియబిట్టలసి తేత

లిరుఁబోణి। సలుగులియ్యవిజంకకలుగులయ్యె వికొంకకలుగుల
మొందితేయనుఁగుఁజెలియ। కలుగుచాలెంచునుబలుగుఱాలించు
సునలుగుడందితెత్రోవనడచిమగువ। యనుచుఁగైదండనొసఁగుచు
నంతకంత। కువిదబాములఁగనిపైఁపకుబికిపొంగి। పొరలివలువూ
ఉవిడివెల్లి విరిసితెరలు। తెరలగుచువచ్చు వగపునఁదెఱవఁ
గాంచి॥ 52

సీ॥ చలువరాఱానేలఁజనఁదలంగెడినీకుగరువుగట్టులమెట్టియరుగవల
సె। తలిరుఁబూసెజ్జమైగలఁగఁగూరుకు నీకునెండఁబండలపైఁబ
రుండవలసె। చిలుకపలుకులకింతతలఁకియులెక్కడు నీకుఁబులుల
రొప్పులనుబాటిలఁగవలసె। ననదీఁగెమైగంమనవిపీఁగిచనునీకుబ
లుకాఱుపొదలగామెలఁగవలసె।యెండకన్నునువానకన్నెఱుఁగ
నట్టి। నీకునివ్వెఱ్ఱునెరగలినిగుడుసెగల। వ్రంతలందఁగవలసెఁ
గావాలుఁగంటి। కటకటాయేమితొలిజన్నిగట్టువ్రాఁత॥ 53

సీ॥ ఉడుకాఱనట్టియీపడఁకులోయలునీకునలరుటోవరులయ్యెనానె
లంత। గాండ్రించుపులులుసింగంబులియ్యవినీకువరవుడులయ్యెనే
వాలుఁగంటి। తినవిసంబైనయీగెనుసుదుంపలునీకు నెఱిమోగి
రంబయ్యెనేవెలంది। అడుగంటువాఁగులయడుసునీరిదినీకుఁబాన
కంబయ్యెనేపడఁతిమిన్న॥కనలుకార్చిచ్చునసికప్పుకప్పబూది।కల
పమయ్యెనెనీకుఁగ్రాల్గంటినేఁడు। నిన్నుఁగన్గొనుకోలఁదికినెగులఁ
బొగిలి। యొరియుచున్నదిమదితగవెద్దియనుడు॥ 54

గీ॥ అన్నియెఱిఁగియుమీరిటులలయనేల। వసములేమేలుకీళ్ళువ్విచ్చు
ఁబోవు। కొన్నినాళ్ళెండవెన్నెలకొన్నినాళ్ళు। చీఁకటిగదాసతం
బయిచేలఁగుటెద్ది॥ 55

గీ॥ కలిమిమబ్బక లేమికిఁ గలఁక వడక। యెలమిఁ బొంగక యిడుములఁ డ
లఁగ కెప్పు। డొకరి పోలికమైఁ దఱినొనరఁ బుచ్చు। టెఱుకగలవా
రి చందమై యెసఁగుఁ గాదె॥ 56

మ॥ కలనాఁ డెల్లర లర్చి దీమస మెదన్ గాన్పింపఁ గా నేర్తురా।
వలసీద్రంబునఁ దాల్మినోడుదురు చేవన్ మీఱి విన్నాణులో।
యలఁతన్ బొందుక లందికిన్ నిలుతురొయ్యన్ గాన వేల్పిట్లు చి।
క్కులఁ గారించెడునొండు గామమన యుక్తున్ డెక్కు దానారయన్ 57

క॥ అనిపలు వితములనిత్తములఁ। దనబడలిక దోఁపనీనితగవునవలా
పెనిమిటికెఱిఁగించుచుమును। జనిచని యోలాకు హెచ్చు సరవిన్
గానన్॥ 58

సీ॥ ఎడనెడ నిలచి చొప్పడరనొత్తిన వాలుతుఱుము రెప్పలఁ దొట్టియఱు
తద్రావాల। ముండ్లీఁగి పాదరిండ్లము నుకొనియెగు చోఁదొడగఱలను సే
లలొడిసికొనఁగ। బిక్కొండ తాఁకు మైఁ బెటిలు మైదివియఁ జనుప
పూసలమాడ్కిఁ జెమటలొడియ। తన పెన్మిటియలంతఁ గనిసుందఁ
గానొడుకన్నీటి సెలలు చన్నట్లు జాఱ॥ కాళ్ళు దడబడ నిట్టూర్పు గడలు
కొనఁగ। మోము వసివాళ్ళు వాఱఁగ వెమ్మావిబ్రిమల। కొడుకు సంది
టనిడుకొని నడవలేక। నడచిచను చంద్రమతిఁ గాంచి వడుగఁడ।
పుడు॥ 59

గీ॥ ఇదిగదా వీరి నలయింప నదనటంచు। విన్నఁదనమున లేనిమై వెతఁగ
లంగి। సోలి వ్రాలుచు నందందఁ బూలిదీలి। దారి నడచుచుఁ గల్లవి
తాకుఁదవిలి॥ 60

క॥ పడికొంత తడికిఁ దేఱిన। వడువునఁ గాన్పించి రాచవలఁతి మొగం
బున్। బొడగని తేఁడాయసుఱులు। గడువడిఁ జనను న్న వేమిగా
నున్నదొకో॥ 61

క॥ బిట్టలజడిఁదోరితనిఁక। గట్టిగమాటాడనోపఁగటకటనన్నీ। నట్టడివి
పాలుగన్నని। కట్టడిఁదొలిజన్మగట్టుగావించెనొకో॥ 62

క॥ జడలిక పెంపునముందొక। యడుగేనియునడవనోప నకట టికము
నీ। కొడమనొకప్రాఁకునీడకు। వడిఁజేరి బిడూపఁబాపు వైపిటఁ
గనుఁడీ॥ 63

గీ॥ అనుచుభూమియనీరెలుంగునమఱింత। చంద్రమతికినిమఱిహరిశ్చం
ద్రునకును। వగపురెట్టింపనిట్టూర్పునిగుడఁదనము। తన్నిదంద్రులపై
సారెతలఁపునిలిపి॥ 64

క॥ ఓయొజ్జగాధిచూలీ। మీయజ్ఞలఁగాంచుపదవిమేకొనునెయిఁకన్।
హాయనుఁగుఁడల్లినిన్నెడ। బాయంగానైతినడవిపాలైతెఁగదే॥ 65

క॥ అనిపలువగలబవంతం। బునఁదడుపున్ దారిదాటిమునుకుటజేఁ
డున్। గనితలఁకియకటకొడిమెలు। పనుపడనీపాలుకోలకుఁబా
లౌదునొకో॥ 66

సీ॥ ఊసులులూటాడంగమిసుమింతుఁడైయున్నవాఁడుత్రోవయలంత
వలనవడుగు। నోరాలుకొనివచ్చెనీరేయెడనుగానదొరువులవాఁ
గులదొనలసెలల। ప్రొద్దునుగ్రుంకెడిఁబులులుగండు మెకాలువిడి
తమనెప్పులవెడలుటయ్యె। నడుకానయుందెందుఁగడిఁదిగుట్టలెకా
నికారుగూడెంబేనిగానరాదు॥ అకటటాయూనిరాబారియరయ
కురక। వెంటనీమెణకరినేలయంటగట్టె। నేమిమూడుటకున్నదో
యింకముందు। ననుచుప్రాన్సుడియుండఁబ్రోయాలుగాంచి॥ 67

మ॥ పనిగాదీవగమీరలుంటకనుఁడాపట్టందియొకిటంతప।
చ్చనిలేఁబచ్చికయునిటగాన్పడెడివెంచంబుఢడునందొండుగ।
కుటనమీరచ్చటికేగియందుఁబయికొంగున్ ముంచిసీరింతతె।
చ్చినని ప్పాపనిసేదదేర్పననువాఁజేఁడ్పాటగున్ గానిచోన్॥ 68

గీ॥ కొడుకుఁగాచుటటుండ నివ్వడుగుకుట్టుఁ। గాచు టెంతయు నెక్కు-
డు కానమనల। నరసివచ్చినకతమునఁ నదియుఁగాక। పాఱుఁడును
నెవ్వరిట లేని వాఁడుమఱియు॥ 69

చ॥ అనుడు వెలందియేనుమడుగారసి నీరిదె తెత్తు వీని నం।
దనుకనలంతఁదేర్పఁదగు తన్నువితంబులఁ దన్పుమంచుఁ దాఁ।
జనుటయు నింతియవ్వడుగుఁ జక్కనెలర్పుచు గాలిదోలఁగాఁ।
చనమువయింటవీచికనుఁ దమ్ములఁగా ఱెడునీరుఁ బాపుచున్॥ 70

గీ॥ అన్నతలఁగకంచునడుగులొత్తుచుదండ। నాఁకలికిఁగరంబునంగలా
ర్చి। పైఁటనిముకుననుఁగుఁబట్టినినోదార్చి। కొనుచునుండ గాధి
కొమరుఁడపుడు॥ 71

మ॥ చలముంబైకొని పెచ్చురేఁగి దొరకర్జంబొచ్చె మొందింపలోఁ।
దలఁపుంబేరిమిసోఁకు జోదొకనిఁ జెంతం దోఁచ రావించి యో।
పొలదిండీకనుఁగొంటె నీరిపుడు తేఁబోనున్న యాతేనిఁజి।
కుఱ్ఱలఁగుందంబురికొల్పి వానిదిటముంగూల్పం దెఱంగెంచుమా॥ 72

క॥ ఈమాపటిదనుకీయెడఁ। బ్రేముడిమాటలనొకవళ్ళిబింకంబుననో। యే
మఱపి వానినవ్వల। నామట్టిం గంటెయదిగొ యద్దానిపయిన్॥ 73

మ॥ జగమేపారఁదలంకఁ జేయఁగల మైసత్త్వోందికారించుటే।
తగులంబొందినరక్కసుండొకఁడు వేతాళుండు నామీఁటెబ।
ల్పొగరుం జేకొనియున్నవాఁడచటికిం బోఁబంచినం తేనిలే।
మెగముం గ్రోల్పులి గ్రమ్మింగు చందమునఁ దాఁ గ్రమ్మింగ నుంకించెడున్॥ 74

గీ॥ అప్పుడుగదా హరిశ్చంద్రు నరిదియుఱిది। పట్టుదిట్టంబుఁగడు నెట్ట
పంటయగును। వెడలుమనవాఁడు జడదారివీడుకొంచుఁ। బంచబం
గాళమై వెడబమునఁ బొనరి॥ 75

మత్తకోకిల॥ బ్రాఁతిమైనను కావివల్వలఁబన్ని కెంజడలాడఁగా। బూతి
పూఁతయు జింకతోలుక బొందళమ్ము గ్రాలఁగా। నూఁతలాత
ము మోఁగవాగలునొద్దబొక్కణ మొప్పఁగా। జేతమేల్ రుమరా
కలొప్పెడు చేరుఁద్రిప్పుచు నొక్కచోన్॥ 76

మ॥ పరపౌజింకకళాసమున్ బఱచియా పైనొలిఁగూర్చుండిక।
న్నరమోడ్పు న్నెఱి మోనమున్ గొలిపి డాయన్ రాఁడె యేఁడంచుఁ దా
సరవిన్ వార్చియటుండ నంతదొర వెంచంబుల్ సెలల్ సొరువుల్।
దొరువుల్ గన్గొని నీరొకింతయుట నెందున్ లేమి ముందేగుచోన్॥ 77

మ॥ కనియయ్యుక్కవునిక్కవంపురుసి గాఁ గ్రాలన్ వెసన్ డాసి బ।
త్తిని గై మోడ్పులొనర్చి యోతబిసియెం తే నేఁడు వేండ్రంపు టెం।
డను గానన్ బడి బిట్టుఁదూలితిమి వెంటం బ్రేముడిన్ మమ్ము మీ।
నెనరుం జూడిక్కఁగనుంగొనుండనవుడున్ నేర్పొప్ప నాసోఁకుడున్ 78

చ॥ ఒనరఁగ జోగపున్నిమరనుండియుఁ దానపుడష్టై తెల్విమే।
లక్కనువగఁగన్ను విచ్చి దొరఁగన్గొని దీవెనలిచ్చు పోలికన్।
గొణఁగుచు యేఁడనీదు తెఱఁగున్ మది చూడక్కనిగంటి నెంతొ జా।
లిని నెనయించు నీకలిమి లేముల నెంచఁగ నంతకంతకున్॥ 79

క॥ ఈవు హరిశ్చంద్రుండను। రావలఁతి వయోధ్యయేలు రాజవు మఱి
యా। దావరి త్రిశంకుకొమరుఁడ। వీవొకనిక్కంపుఁ బ్రతినయే
పునఁగడఁకన్॥ 80

ఉ॥ ఈవిగఁ బ్రోలు నేలుబడి నెల్లనొడంబడి గాధిపట్టికిన్।
బ్రోవుగనిచ్చి మున్దనకుఁబోలఁగ జన్నముపొంటె నీకొనం।
గావహి నాడినట్టి నుడి కట్టడి నప్పు పసిండి నప్పుడీ।
గాత్రడి లేమిఁబై తరువు కాని నిబంచిన నీవుఁ జానయున్॥ 81

ఉ॥ ఏసరకెందు నేరవడి నిచ్చెదనంచు గడింపనోసరం।
గాసముకట్టి రాఁదరువుఁ గాఁడిటమూపటిలంగ వానికై।
వేసరినీరు రోయనడవిం బడివచ్చినవాఁడవంచు రా।
కాసియెఱుంగఁ బల్కఁ దొరఁగ్రచ్చ యనచ్చెరువంది పెచ్చుగన్॥ 82

శా॥ మీరున్ గానని పోవడుల్ గలవె నెమ్మిన్ వేల్పుమ్మోమునీ।
గోరంపున్నడుకాన మిమ్మునిట మాకున్ జూపె వేఁబ్రోవుఁడీ।
దారిన్ దూపి లెఁబాఱుఁ డింతకొకచందంబైన దూఱానుమీ।
జారీ నీరొకయింతయుండుదగఁబుచ్చన్ ద్రావఁగా నేగుడున్॥ 83

క॥ నీరేమెడఁబోడగానమి। నీరేయించుకకరంబు నీరేయు మెగాల్।
గారింపకుండనాదట। నీరేనిటమమ్మునిల్వ నీరేయనుడున్॥ 84

క॥ నిచ్చలు నడవులఁబడియే। పొచ్చెంబులు లేని మాకుఁ బొందగు
నెసతం। బొచ్చెపుఁ గ్రచ్చులనిచ్చల। నెచ్చినగేస్తులను మిమ్ము నీయెడఁ
జేర్పన్॥ 85

గీ॥ ఇంతనాఁడు తల్లి నేమి చూచితొ కాని। పుట్టిబుద్ధియెఱిఁగి పొలఁతి జా
డఁ। గానఁగానఁగానఁగలది చెప్పితి మీకు। రాఁగఁ జెల్లదించు రా
వలంతి॥ 86

క॥ దారిన్ వడుగఁడు దప్పిన్। దోరుటలువినిజ మెమూపఁ దొలఁచఁగజా
రీ। నీరివిసాలు నెమఱియున్। వారువఁగావలయు నిపుడు ప్రాలె
డుఁ బ్రొద్దున్॥ 87

మ॥ అకటా యొంజెలిదీ అనీకిపుడు సాయం బొండు నేఁ జేయ లే।
మికినెం తేమదిఁబల్లటింతునయినన్ మేలొం డెఱింగింతుద।
ప్పక యాప్రకటను జేనుపట్టు గడవన్ బ్రామ్మజ్జి యొక్కొండుగం।
టికిగా న్నిం చెడినాకడన్ బడియవిం టేయున్న దచ్చోటికిన్॥ 88

గీ॥ ప్రొద్దుమునుఁగకమును వేగఁబోయియాంకొ। లంపవనునీరు ద్రావిక లంకు వెడల। రేయి నాశ్రమానికడనుండుఁడీయటంచు। మోసపుం బాసవాల్దెల్పి మొఱఁగిచనియె॥ 89

క॥ పులుఁగులు నెలవుల జేరఁగ। జిలువలుగలుగులనుదోలఁగి సెలయఁగ సింగం। బులుఁబులులుఱ్ఱబడిఁదమతమ। కలఁకులు వెలువెడలజగ ముకన్నటద్రావాలెఱ్ఱ॥ 90

గీ॥ జగమువిందయ్యెనొకవంగసంబువాఁడు। నయ్యెఁదానుహరిశ్చంద్రుఁడడలుచుంటఁ। గనియునోదార్ప కేప్రొద్దుగడచిచనియెఁ। గంటె చుట్టలుదఱిదప్పఁగంటగింత్రు॥ 91

గీ॥ అప్పుడప్పుడె కెంజాయలడఁగలేఁత। చీకువాఁ్గప్పులంతంతచిలుక రింపఁ। దొలుతఁదాఁబడివచ్చినత్రోవమరలి। కదలిచనిహరిశ్చంద్రుఁడాకాననపుడు॥ 92

గీ॥ తెకు్కవడిచూడఁజుట్టంబుద్రొక్కవేల్పు। లేనియికానదోరితి నేనటంచుఁ। గుచ్ఛితములాడు మెణకఱగు స్తరించు। లేమఁగనియెం మనీరింత లేమిఁదెలిపి॥ 93

క॥ ముందొకపరువిటుపోఁబో। జెందొవకొలనొండుమట్టిచెట్టునుగ లదం। చిందనుకతబిసియొకరుఁడు। విం్దైయెఱఁగించెనటకు వెడ లుదమనుచుఱ్ఱ॥ 94

సీ॥ మిట్టపల్లములుచూపట్టనీయక చిమ్మచీఁకటుల్ జగమెగ్రాఁకిక్రమ్మ। చుక్కచాల్గాలింతద్రుక్కఁగ్రొక్కార్యొయిప్పుప్పరంబెంతయుఁగ ప్పుకొనఁగ। మిట్టాడు తెఱనోటిమెగపురాపసిద్దిండ్లబొబ్బరింతలు బీతిప్రబ్బనుబ్బ। విచ్చలవిడిహెచ్చి వెడ్డురేఁద్రిమ్మరికొఱవితాల్పులె యాప్పులఱుముకొనఁగ। గుడ్లగూబలుగుంద్రలుగొలుపఁదఱచు।

పఱడులందంపుబోటియలన్నొఱలియఱవ। నపుడు బేడిదంబైనకాఱ
డవి తేఁడు। కన్నుగన్నును గానని కటికయిరుల॥ 95

చ॥ వసుఁగనిమూఁపుపైఁజెలుతవానిని సందిటఁజక్కఁ జేర్చిలో। జడు
పుఁదోలంచియుండఁ గొని చంద్రమతిన్ గయిదండఁ దార్చిచే। నడ
రున రాజ క్రొంబెడఁగులయ్యెడదారి యొకింత సూపఁద। కీడ్జి
డదారి తొల్లి యొఱఁగించినకందువ నందముందరన్॥ 96

సీ॥ జుంజులు జైదోఁచుజొంపంపుటూడలు విరియబోసిన తలవెంట్రు
కలన। రివట రెమ్మలు నాకులవిగ్రికీటి యఁగ్రమ్ము కొఱుజీఁకట్లు మై
కటియయనఁగ। గుబురు వెల్వడు మిణుంగురు పులుంగులు కంటి
గుంటల విడుమిడుంగురులనంగ। తొఱటలవిసమెలకఁగొఱలుచి
ల్వాలసెకల్ గ్రాఁచు నాలకలుకొఱకచ్చులనఁగ। గూబలరొదాళ
ములు వెఱగొల్పులనఁగ। మింటికినిమంటికిని గెంటకంటిచూడ్కి।
కళుకుఁబుట్టించుకొఱవిదయ్యంబు మాడ్కి। నడరు వేతాళు మట్టిఁ
దానరసి దటిసి॥ 97

క॥ బలునీటి పుత్తిగమిచి। ల్వాలగుమితా మేటితుటుము వలనగు తెఱగం।
టులపరి మొసళ్ళకూటువ। గలడిగ్గియఁగాంచి తేఁడుగట్టె మట
యటన్॥ 98

మ॥ దరిపై వారలడించి సూపదొలఁచన్ దానీటినిన్ ద్రాపియుఁ।
కరి తానున్ బ్డెఁగ్రుంకి సందపనులన్ గావించి నీరాని చె।
చ్చెర నామ్రత్త్రియక్రిందఁ జేర్పన వలాచేఁబోఁపు వోనూడ్చిపూ।
రిరహిన్ మొత్తగఁదార్చియత్తడుపు దారిన్ జేర్పఁగా వ్రాఁడునున్॥ 99

క॥ నిమురసుగ మెఱుఁగదనుటిపు। డదనయ్యెన్ దనకటంచు నారటపా

టున్। మదిఁ గన్న పగిది బూమెలు। చదువుచుఁ గను మోడ్చి తబిసి
చలమెనయింపన్॥ 100

గీ॥ ఆఁకటికి డస్సి వాపోవు ననుఁగుఁ బట్టి। బుజ్జగించుచు నిద్దుర వోమ్ము తం
డ్రి। వేఁగ దినఁ బండ్లు నాపోవ వేగ నిత్తు। ననుచు నటఁ గూర్కు జోకొ
ట్టుచును వెలంది॥ 101

గీ॥ త్రోవ యలఁతయు గోదయు నొత్తుగువు వెనుప। వడుగు నడుగుల కడ
నేలఁ బ్రైఁట చెఱఁగుఁ। బఱచికను మోడ్చిఁ దా నాద మఱచికంటె।
కటిక నేలయ దేడ రా గరిత మేడ॥ 102

మ॥ ననబోణిన్ జెలి ముద్దియన్ గరిత విన్నాణంపు సింగారిఁ జ।
క్కని క్రాల్గంటిఁ గడాని బొమ్మ నవలాకన్నాకుఁ బ్రోయాలు జ।
వ్వని నిల్లాలిఁ బడంతి నేఁడు పడుఁ గ్రేవన్ గాంచియే నాఁడు నే।
వనటన్ గాననిదాని నేఁ డిటుల నెవ్వం బుబ్బి తే వేలుపా॥ 103

మ॥ అనివంతం గని యొట్టకేలకు జదిన్ హత్తించి యా ప్రక్కనెం।
మనుమిట్టాడు మెకాలనావడులోగిన్ దోఁపింపకుండంగ మే।
లక్కని క్కై వాల్గొని పూని హెచ్చరిక మైఁ గ్రాలంగ నామత్తినుం।
డిన వేతాళుని బంటు కండరిది పాటిల్లన్ గనుంగొంచుఁ దాన్। 104

మ॥ తన చేదోడుగ నెయ్యురం బిలిచి యిద్దండన్ గనుంగొండు చి।
క్కని మైచుక్కని నిక్కుమానిసిని, మెక్కం బోన మైపీఁడు ద।
క్కెనటం బ్రాముననుత్తియూడల వెసన్ గిఁ బెట్టుచున్ దూఁకి చ।
య్యన నొక్కైత్తు నమింగు పూన్కిఁ బయిడాయన్ పేఁడు దానంతలోన్
105

మ॥ అడిదంబున్ వడిఁ ద్రిప్పి వ్రేసి మెయి వ్రయ్యన్ వానిఁ బోకార్చి వెం।
బడి నే తెంచిన తక్కసోఁకులను నొవ్వన్ జేయ హరంతవా।

విడుచుఁజెచ్చెర బారివీడిచనియో వేతాళ నేఁడిందునే।
వ్వఁడో యొక్కఁడడరుదెంచి యిమ్మిటుల ద్రెవ్వన్ జేసెరా వేయనన్ 106

సీ॥ నెనడెల్లజుత్తివై దినపుత్త్రపరిచేలు లలుతనో కెఱ్ఱగొల్పగిటకో
నంగ। నిట్టఁదీఁటిన మాసిపొట్ట ప్రేవుల తెట్టె జందెంబులై బొట్టఁ
గ్రంమకోనఁగ। కుడిచిగజ్జని త్రేఁపఁ గ్రోలవెక్కసమైన కటికినె
త్రొడలిపైఁ గాల్వగట్టి। ఎఱచినెమ్ములఁ బంటఁగఱచఁ దీఁగెలుసాగ
నొచ్చిళ్ళగాఱి మైఱొచ్చఁబఱప। మిన్నుమన్నును నొఱయమం
పల్లి పెఱిగి। నెఱసి తుది రేయి మొయిలునాఁగ ఱియఁ దేరి। వేడిమం
టలు గ్రక్కఁ గ్రొవ్వాఁడి కోర। లుదియఁదీడుచు వేతాళుఁడెమట
నిలిచి॥ 107

శా॥ ఏరా మానిసి యెట్టులీ యెడకు నీకే తేరఁగాఁ గల్గెనా।
పేరున్ జెప్పను మిత్రిమిత్రియుఁ బోరిన్ వెన్నుండుమన్ బీతినా।
బారిన్ జిక్కక పాఱిపో మురరయన్ వంటింటికుం దేటిచో।
ప్పారందోఁ చితివిందు విందుగొనమా కాబూతివంచుండఁగన్।108

క॥ ఈరక్కసి యార్పులకిటఁ। గూరుకువిడి కోమయువడుగుఁ గోమరుఁ
డు బీతిన్। గూరుమరని సోఁకున్ ద। వ్వారన్ వడి నెట్టిముట్ట నార్చు
చు వాఁడున్॥ 109

శా॥ కొండల్ మార్వ్రలుకన్ గరంబుఁ బడుకుల్ గ్రొంగ్రోడు వోవన్ వడిన్
మెండౌ నల్కఁ నఁబల్కరించి యుఱిదిన్ మేటిన్నిరా ఈనిపై।
బండల్ గుండ్లొఱగంగ నూకి పఱపన్ బాటింపక వ్వానిబల్।
కం దెంపున్ గఝుబల్మిఁ గేడెమున రాక న్నాకు సెండాడినన్॥ 110

హా॥ సోఁకా బిమ్మటఁ బ్రామిడిన్ బెఱిగి మైసోలంబునన్ హెచ్చిపె।
న్నాకఁగుల్ చేకోని దాఁకగాఁ బెలుచ నామన్నీఁడు చేవాలునన్।

వీఁకన్ నానినడంచి రక్కసుని కేశ్రేణిలంగబిట్టేయన।
త్రాఁకున్ దూఁకొనినొచ్చి చేదోఱఁగియున్ దయ్యంబు పెల్లుబ్బునన్॥ 111

మ॥ ఱలనొండున్ బెకలించి వ్రేయగమకింపన్ బోయియామాత్రికో।
మ్మలక్రీ నేలఁబరుండు వారిఁగని మైమై గాతి సేకూరెనాఁ।
కలిదీఱన్ వెసవీగి మెక్కి పిదపన్ గయ్యంబుఁ గావింతునం।
చలఁతిన్ జెట్టట డాయఁగా నెఱిఁగి తేడంతన్ జలంబూనుచున్॥ 112

శా॥ రారామెక్కడి కేగెదీవటులనో రాకాసి నిన్నీమెడన్।
దోరింతున్ వడినంచుమాత్రిఁదోలఁగన్ దోడ్తోడ దౌదవ్వగాఁ।
దోరంపున్ వడి నెట్టిపట్టియమునన్ భ్రంగింపవాఁడంతమై।
బీరంబున్ జెడిత్రావెలెఁగొండలచటన్ వ్రేఁకంబునన్ గ్రుంగఁగన్॥ 113

గీ॥ ఇటుల వేతాళుఁ బాలార్చియేపుగన్న। యాహరిశ్చంద్రుఁ గూర్చియ
య్యార్యెరెదిటము। వాయఁడెందుననని గాధిపట్టియపుడు। పడమటి
వలంతిజడి గొట్టఁబంచుటయును॥ 114

క॥ మనతోఁడగు వేతాళున్। దునిమెనిఁకన్ వీఁడు మనల మాటార్చుని
టన్। బొనరననిబూచులఘుకున। మినుభ్రాఁకినవనమొయిళ్ళుమిం
టిన్ గప్పెన్॥ 115

గీ॥ మింటఁబఱచియుఁగడిమి వెన్నంటితమ్ముఁ। గడఁగిచక్కడునోయ
నియతలి కావు। కావుమనితేనివాచారగాము లెల్ల। మొఱలిడెనొ
యన్నవగనప్పుడుఱుములుఱిమె॥ 116

గీ॥ నేఁటిదనుకనుమనల మేల్నెఱపిమనిచి। నట్టివేతాళుఁడోటిగెల్వబా
పందనిఁదొక। నేరనుచు గాములెల్లకన్నీరువెట్టె। ననగఁజోటచోట
రోజెనుజినుకులప్పుడు॥ 117

గీ॥ బ్రదిమిపైనింతయూసమీకొదవనింము। రాకచనుఁడుపిసాసులా
రాయటంచు। బీతుగొల్పఁదుపాసిజల్పించువాఁడి। వాలుమిఱుమి
ట్లునామించులోలిఁబరఁగె॥ 118

సీ॥ చిమ్మచీకఁటిముమ్మరమ్మింత రెట్టింపఁగ్రొమ్మొయిళ్ళపుడుప్పరమ్మఁగ్ర
మ్మ। వేళ్ళతోఁజెళ్ళెల్లవెల్లగిల్లఁగరమ్మునుల్లఱమ్మునగాడ్పులాకటపీచఁ।
గడలపెన్నెంటత్రాగుడులవీనులుగడెల్ పఱపఱంపిలు మ్రోఁత
నుఱుములుఱుమ। నిట్టనిల్వునగట్లునెఱిసిబీఁటలువాఱిపొడవడం
గఁగదండఁబిడుగులురల॥ గడుసుఁబదటునఁగడువడగండ్లురాలఁ।
దఱుచుమిఱుమిట్లుగొల్పుక్రొమ్మెఱుములడర। మొదటిమెలగోలు
జల్లింతముదిరివాన। మించెఁగడవలనీర్గుమ్మరించినటుల॥ 119

గీ॥ ఇటులనెడతెగకేఱులైయెందునీరు। దొరలపాఱునజడిగొట్టఁ
దొప్పదోఁగి। తడిసివలిగాలిగజగజవడఁకువడుగుఁ। బొదిగిటనుజే
ర్చిరాతేఁడుపొలఁతిగాంచి॥ 120

గీ॥ కట్టవలువదప్పపట్టిమైగప్పఁగా। రెంటమింతలేదుకంటెచెలియ।
కలిమికొలఁదిలేమిగలుగునంచనిపెద్ద। లాడుమాటదప్పనాయొ
కింత॥ 121

క॥ అనికొమరునకుఁజేర్చిన। తనచెలిఁజంద్రమతిఁదగవుదళుకొత్తు
వితం। బునమూరడించినాగులున్। గనసీనిదిటంబుపెంపుఁగనుఁగొ
నియుండన్॥ 122

గీ॥ అపుడుగాధికొమరుఁడాహరిశ్చంద్రుని। నిబ్బరంపుటుఱిదికబ్బ
రంబు। వడుచుఁదనమప్రతినగడతేరెడినోలేదో। కోయటంచునె
డఁదనుజ్జగొనుచు॥ 123

చ॥ వరకులువంతలున్ వెతలువన్నుకొలందికినంతకంతకున్।
బరువడి హెచ్చి తాదిటవునన్ గడిదేరెడుగానియించుకేఁ।
దెరలఁడువిన్నవోఁడకటదీకొనియేలవసిష్ఠుతోడనాఁ।
డరయక వేఁదు త్రైప్రతినలాడితి వేలుపుఋసికోల్వునన్॥ 124

గీ॥ కుడిచికూర్చుండ కేలేని గొడవలేల। తెచ్చికొంటిని పెద్దలఁదెగడి
కాని। కఱదలాడినదదియెట్లుగడచుపడుప। కనరువడనంచునను
వోకండరయుచుండె॥ 125

చ॥ కలువలువంతఁగూరెవలిగాడ్పులసోఁకులుమూరెఁజుట్టుఁబు।
ల్గులు చెలువారెగూడెములఁగోళ్ళయెలుంగులుమీఱె మెట్టద।
మ్ములవెతలాఱెరిక్కగమిము ర్వ్యెడలంగఁగఁదాఱెఁదూర్పునన్।
దెలతెలవాఱెఁజేఁకటులుదీఱెజగంబుననంతకంతకున్॥ 126

సీ॥ దొరహరిశ్చంద్రుమనిబ్బరముగానఁగవచ్చు తిగవేలుపులయిమ్ము తే
జనంగ। కనిచంద్రమతియాలువును మెచ్చిమలగొంగ చెలిపంపు
చెంద్రంపుఁజిప్పమనఁగ। తబిసివసిష్ఠుపంతము గెల్చునని వేల్పు గ
మిచాటనెత్తుజేగంటయనఁగ। గెలువనైతినటంచుఁదలఁచి కౌశికుఁ
డల్గఁ గంటిజేవులు పేరుకరుడనంగ। నిరులతెవతుంటజక్కవయిం
టిపంట। తొంటినుడియంట చెందొవకంటిమంట। పంటపైరులదో
రజంటమింటిగంట। వెంటఁగనుబట్టెఁదమ్మివాల్గంటిదంట॥ 127

గీ॥ మట్టినుండికదలిమిట్టులవట్టులఁ। గాళ్ళవీళ్ళ నేళ్ళనూళ్ళ నాళ్ళఁ। గ
నుచుఁజనుచు వెతలఁగంమచుగుంచుచు। దారిదారివారుదరులఁ
దరల॥ 128

క॥ ఎండగడుబలిసెనడుగులు। మండెన్ దొనలెండెనెండమావులుసిం
డెన్। గొండలుదరికొనెనుడువులు। వండువడ్డెన్ బ్రోద్దునెత్తిపై
కెక్కె వెసన్॥ 129

గీ॥ ఇంతకీవిట్లునను మాటికెల్లి సముగ। ఁబలుకుటఁదలంపనన్నొకబడు
గుఁబేద। పాలువానిఁగఁజూచియిప్పుడఁతిఁగొనఁగ। ఁజాలఁడనికడ
యెంచెమ సరకుగొనక। 141

చ॥ కొలఁదియెఱుంగవోరివిను, గోణముగట్టిన నాఁటనుండిపీ।
న్గులవెసమోది తేగములగోఁజిపసిండిగ్గడించివడ్డివ।
ట్రిలఁగనుటంక మొకఁటికి రెండును మూఁడును నాల్గుఁగట్టినా।
త్తెలయఁగఁజేర్చితి౯ మదిని నేమనుకొంటివొ నేనలంతినే?॥ 142

మ॥ అని తానప్పుడు మాటదించికొనిచయ్య౯ విప్పియెంచుండితె।
చ్చెనొ పాలుండుపసిండిటంకముల రాసి౯ బోసి, కైకోలె, చెం।
దెనె, నీజట్టియటంచు మేకొలిపి తేనె౯, గినఁజాగేమిఁక౯।
జను దెమ్మంచుఁగడంగి చంద్రమతిఁగ్రన్న౯ జీరఁగానంతట౯॥ 143

మ॥ తెరల౯ వంతగనుంగవ౯ వఱద లేతేరంగ, నజ్జోటిలో।
దురపిల్ల౯ జనమూఁడు నాలుగడుగుల్ దొట్రిల్లము న్బెట్టిఁజె।
చ్చెరనమ్మాయనికొంగువట్టి పసిగాసి౯ లోహితుం డేడ్వ వం।
దురితేఁడిట్లనెఁగాల కౌశికునకు౯ బోలంగడగ్గుత్తిక౯॥ 144

గీ॥ అవుఁగొని క్రేపుఁబాపుదురే! వటింప। విలువనున్నవరాలిన్ని వేలా
సంగు। మిపుడుతనతల్లి వెనుబడి నేగవేగఁ। బని చెదనుపీని నాముద్దు
టనుఁగుఁబట్టి॥ 145

మ॥ అననాకల్లరి నేలజేజెయనునొరావింత! యెంద్రైననొ।
ప్పనెనీవాఁడు తెఱంగులావుఁగొనఁ గ్రేపు౯ వెంటఁబుత్తెంపఁగా।
నన్నవొ చందముఁబాడియు౯ గలుగ, నీవా నాకడ౯ నేఁడుసా।
త్తును రాఁబట్టుటతల్లిపిల్లలకుఁదోడ్తోఁజట్టివేర్వాఱుగ౯॥ 146

గీ॥ పలుకకున్న నావుపలుపునకొక జట్టి। యనుచునింక నేమియటమటిం
చి। వాములాడనున్న వాఁడవొనిలుపునీ। జాణతనములిందుజరు
గవనుఖు॥ 147

క॥ బళి! యమ్ముడుతజీనాగా। దిలిపైదలివిలువనీకుఁ దెలిపితిఁగానీ।
యెలకందఁజేరుకొనియు। వ్వేలలో వాఁడనుచుఁదొలుతవినిపించి
తి నే?॥ 148

క॥ ఏలా వెడపలుకులుకొనఁ। జాలితి వేనిక బసిండిచౌకంబిడునా। చూ
లినొసంగెద, లేదా। ప్రేలకహొమ్మనుడు, నేలవేలుపుగినుక॥ 149

గీ॥ విలువఁగనుదాఁకనీవేమిపలుకనున్నఁ। బలుకఁదగుఁగానికైకోలు
వడయబేర। మాడియీకోలుఁగొనుగోలుచైనపిదపఁ। బొసఁగద
న నేనుబోము నేనిసువ్వదలి॥ 150

ఉ॥ ఇంతకుగాధిపోఱనికినీకొనఁగన్గినతొంటిలిబ్బికిక।
గొంతకొఅంతయమ్యోనకూళతనంబుననిట్టులాడెదో।
క్రంతలనెంచునేమొఅఁగికన్నమువెట్టియొదారిగొట్టియో।
సంతనఁదెచ్చియిమ్మిచటసాగవునీ వెడవాదులెంతయుక॥ 151

క॥ అనికాలకౌశికుండటు। పెనపరిమ్మైకినుకదొనఁకబేరజములువా।
కొనుచుహరిశ్చంద్రునితోఁ।జనుదెంచినయల్లబమ్మచారింగనుచుక
152

క॥ ఈవాగాధికొమారుని। వావాదులఁదడవుఁబాడివహి నేర్చితిము।
న్నీవైనఁజెప్పవలదే। మావాకాటుడుగఁదగవుమారామిచటక॥
153

గీ॥ నావుడామునింజిదాలుపారావలంతి। నరసియదినీకునీయకోలైనఁ
దోఁచి। నదియెజింగింతునీకిందునాయమనవు। డొడఁబడెదఁదె
ల్పుమూన వేడ్కనుబ్బివడుగు॥ 154

చ॥ తొలుత వెలందినమ్ముకొఱ దోఁపఁగఁబట్టికి వేఱుజట్టియా।
వలెనని లేట తెల్లముగ వాకొనవంచునఁ జేసితన్నినిఁ॥
విలివితనర్చు నిప్పుడమి వేల్పునకిచ్చె ఆనీయఁ బాడియా।
గలిగినచొప్పఁ జెల్పితినిఁ కఁ వెనుదీయుట మెప్పగాదనఁ॥ 155

ఉ॥ అప్పుడు కాలకౌశికుఁడహోయనియ ర్తిలిఁ బాఱుపోఁ అనిఁ।
మెప్పునఁ గౌఁగలించి కొని మేనిమురఁ దమి డాయఁదీసిమా।
యప్పకనుంగొనఁ జిఱుతవయ్యగొనంబులఁ బెద్దవీవటం।
చొప్పిద మొప్పనొండొరులు నొద్దికలాడుటవించునయ్యెడఁ॥ 156

గీ॥ తగవుఁదీర్చెదనని వచ్చితడుపుదారి। యిచ్చకంబులువలెఁ గానిం
కనేమి। సేయఁదగుఁదొల్లఁ దానేమి సెప్పనదియ। నాయమని
యొప్పిమటిదానిద్రోయుటురవె॥ 157

గీ॥ ఓటఁదలఁ బెట్టిరొకటిపోటునకును। వెఱవఁ జెల్లునెతనతల్లి వెంట
వీని। బనుపఁదగవని తెగువనూఁకొనియుఁబనవు। మగనినూరార్చి
మఱిచంద్రమతిదొడంగి॥ 158

క॥ మదినింకమమ్ము మఱవుము। పదపడి వెత లెన్ని పైనఁబడిననిజం
బుఁ। వదలకుమీపొఱుండొగిఁ। బదరిననొకకొదవగాఁగబట్టకు
మెడఁదఁ॥ 159

గీ॥ నవయనక్షత్రకుఁడిన్ని నాళ్ళమనల। గదిమి బెట్టినములువలెఁనది
తలంపఁ। జేరిచెక్కిలినులి వెట్టిచిఱుతకెలమిఁ। బాలుద్రాపినచం
దమ్మై మేలఁనర్చె॥ 160

చ॥ అనియొత్తిఁగిం చియుఁ మగనియండ దొలంగుతలంపు నెకొఁనఁ।
గనుఁగవనీరు చిప్పిలవఁ మరటిన్నికరంబు విన్ననఁ।

బనవుచుఁ గొంత ద్రుక్కఁ గొనిపాసెదె నేఁటికి నిన్నటంచుఁ జె।
ల్వ్యనికోగ్రమొక్కయంత నిసువున్ దమిఁ జాఁగిలఁ జేస వెండియున్
161

చ॥ నెనరునఁ గాంతు వెల్లపుడు నేరములుండిన సైఁతు వెన్నఁడున్।
గనలి మెలుంగ వెంచు నొడికంబుగ నాలుడి సూటిపాటి మే।
కొని మెలఁగంగ నేర్పుమవు కూర్తువు నా మదికో రెక్కలక్కటా।
పనికి కడింది నల్వమ్ముఁ బాపె నెనీదగు హజ్జదోయికిన్॥ 162

మ॥ అని వాక్రుచ్చుచునున్న చంద్రమతిఁ జయ్యన్ జూచి, యిందేమి సై।
దోనరింపన్ దర వాయి వే చెదవె, యోహో చాలు నీ బైజలె।
ల్లనుమున్నే విని కాంచినాఁడ, నిఁక వాలాయించి నెట్టింతు, నో।
య్యన నీ మాటల నెత్తి మోదికొని రవ్వా వేగఁ బ్రోద్దయ్యెడున్॥ 163

గీ॥ కరముఁ గడుపున లేనిది కాఁగలించు। కొనిన వచ్చునె బాళిలో నెనసి నటుల। మగనిఁ గనిపలెక్కదిఁక నేలి మాటలుడిగి। కదలుమని యేర్చుచును గాలకౌశికుండు॥ 164

మ॥ తన పైమూఁపున నొదలన్ వెలయ నెత్తన్ మోయఁగా లేనియు।
ప్పెను మాటల్ నెనరూడ్చి చంద్రమతిపై వేఁ బెట్టియా పై వెసన్।
దనపావల్ గయిఁ జేర్చి చేతిగొడుగున్ జక్కింపఁగా నిచ్చి క్రొ।
న్ననఁదోఁ దెన్మని, లోహితున్ గదిమి విన్నన్ జేయనయ్యన్మయున్
165

మ॥ పలుమాఱున్ దన పెన్నిటిన్ గనుచు నాపన్ రానివంతన్ మదిన్।
గలఁగన్ గొనసి యాడసైఁ జెమటదోఁగన్ గన్గవన్ నీరుపి।
చ్చిలి చిన్నట్లపయిన్ దొరంగ వెతను న్జక్కి ఝ్ఝుజొత్తిల్లేన।
జ్జలు దొట్రిల్లఁగఁ గాలకౌశికుని వజ్జన్ గాశిఁ గాసిన్ జనన్॥ 166

క॥ ఎడనెడఁగలపైఁదలుల। య్యడఁతిఁ గనియబ్బురంబువడుచుఁగటా
యో। యొయ్యడయని చెలియొకతె యి। న్నడఁతుక, తన కెట్టి వెతల నొంది
లవలసెఁ॥ 167

సీ॥ ఇరు చేరలను గొల్వఁదరము గాదు కదమ్మ కనుఁగొనఁ జానకన్నుదో
యి। కొనరి నీడలు జూచుకొనఁగఁ బోలుఁగదమ్మ తలఁపని మ్మగువ చె
క్కిళ్ళుల చెలువు। ప్రతినకై పిడికిటఁబట్టవచ్చుఁగదమ్మ వెలయ నీపైద
లి యుంతి కౌను। అలరింత సోఁకినఁదలఁగి కందుఁగదమ్మ యొలమి నీము
గుద క్రొందళుకు మేను॥ ఏలనో చెల్లి! యీకొమరాలు మేలు। రా
చజవరాలి పోలికల్ రహిని గనియుఁ। గ్రాల కెంతయు నొక పేదరా
లి కరణి। నడిగమూదలపైఁ గొని వెడలు చునికి॥ 168

ఉ॥ ఇక్కడఁ జూడరమ్మ చెలువేర్పడఁ గ్రాలెడు పాలబుగ్గలున్।
జిక్కని కేలుదండలును జిన్నిచొకాటపు ముద్దుమోఁకటుల్।
చక్కని మేనిసొందళుకుఁ జాయలును న్నైలి గొప్పకన్నులున్।
స్రుక్కులు వాలు బొజ్జయును జొప్పడవచ్చెడు నిక్కు మారునిన్॥ 169

ఉ॥ ఏరొకో వీరు, వీరియుని కేర్పడఁదోఁచదు గా! కదమ్మయే।
పారఁగ ముందుఁ బొమ్మనుచు నచ్చెలి యూఁదలమోయ లేని పె।
న్భారకమొంది వేగముది పాటుఁడొకండదె వెంటనంటి పోఁ।
గారుచు, పీనినీ చిటుతఁగాటియ వెట్టెడు నిందుఁగంటిరే॥ 170

క॥ అని మేడలనుండికనుం। గొని చేడెలు వలుకుచుండఁగు మిగొనియ
టదా। రిని వాడల నన బోఁడులు। విని మోడుల కెత్తి నేల వేలుపుఁగ
నుచున్॥ 171

క॥ ఎడపక తిరిసి యొయ్యేఁడుడి। కుడుపుల నోపొట్టవోసికొన కెందితడి।
వ్వడువునఁగ్గొనెఁదనకున్నర। వుడుగానీ రాచకొమరుఁ బూవుం
బోణిన్॥ 172

గీ॥ అంచు వేర్వేఱఁ బేరసడించువారు। వ్రేళ్ళు పెళ్ళన నెటికలు విఱుచు
వారు। నగుచునుండఁగ నంతలో నవ్వలంకు। లందుఁ జనుచున్న మొ
ఱకరులరసి డాసి॥ 173

సీ॥ నాఁడు గేస్తుఁడు చాగి నాఁడె మీఁదనక నిముందుఁ జే జాఁచిన మొఱ
కఁడితఁడె। అలనాఁడు మనలఁ బోఁగిలుబాడి దారపోఁతల కాసులం
దినములు చయితఁడె। సోమాసులటులుండఁదా మొనగానికైవడిఁ
దేగముఁ గొన్నవాఁడితండె। బంతివింముల మెక్కి పడమున్నను
నలఁద్రోపాడి యావులఁ గన్నయతఁడితండె। దొరికె నేఁడని యొ
కఁడు చేమడ్డు నాఁచె। తవిరిజన్నిద మొక్కఁడు ద్రెంచివైచెఁ। గెర
లి యొక్కఁడు మనుబోరగిలఁగఁద్రోచె। నిటుల నకాఁల కౌశికు
నెడరుగుడుప॥ 174

చ॥ కనుఁగొని యంతఁ జంద్రమతి గ్రక్కున వారి కెరంగిఁ యార్తిలిన్।
గనుఁగొనుఁడయ్యలార మతి కాఁటియ వెట్టకుఁడంచు నెంతొ పి।
న్ననమడిజాలి నెకొనఁగ నచ్చిక వేఁడిన వారలమ్మెయిన్।
గనికరమూని పోఁపిడువఁగా నటనమ్మది పాఱుఁడావలన్॥ 175

గీ॥ వడుగు లేగుటఁ బోడగనికడఁక లేచి। వలువ సవరించి కొని జందెము
లఁ దెమల్చి। కొనిప దంపడిఁ జేయూఁతఁ గొనుచుఁ బదరి। చంద్రమతి
ఁగూర్చి కనిసి హైన రెపి సాళ్ళి॥ 176

చ॥ మడుకుఁదనానననిట్టులఁ దొందరఁబెట్టిన ముంజిదారులన్।
జెడుగులఁ బట్టి కొట్టుఁడని చీరి తలారులకొప్పగింపకే।
యెడవడి వారిఁ బోఁబనిచి యేమి యొఱుంగని దానిఁ బోలె నా।
కెడనయాగారమూల్ పలికి కన్నులఁ గప్పెడి నేనె నెఱింగ నే॥ 177

గీ॥ ఇంటఁదినియింటివాసంబు లెన్నినటుల। నెలమినేలెడువారికే మె
గ్గుదలఁచి। తివిబళ్ళాయీవదెట్టిజంతవో తలంపఁ। గదలునీపెండ్లి
నడకలుగట్టిపెట్టి॥ 178

క॥ అనియీతీరునఁగినియుచు। గొనుఁగుచునలకాలకౌశికుఁడుసనవెం
టన్। దనపట్టిఁదోడనిడికొని। మునికితమునవెడలిచంద్రమతియట
వీటన్॥ 179

సీ॥ గాలికినెగరిచిక్కనదప్పుపైకప్పుగుండ నయ్యెవ్యెడ నెండగాయ।
వంగినేలకుఁగూలువాచూరు బరువునకలఁతిగుంజలోకింత నిలువ
కురల। నెఱియుదంతెలనంటికఱిపాఱుపాదొట్టుప్రాలిదండెం
బులవహిఁదలిర్స। పనాఁడొయాఁడ్చినబానసంబున నెంచు మొల
బంటిపెంటకుప్పలుసెలంగ॥ తొల్లియెన్నండొకురిసినజల్లువాన।
చాఱలవిగోడపట్టైలచందమెనయఁ। జెలఁగుతనయిల్లుకాలకౌశి
కుఁడుగాంచి। లోనికేఁగుటయును వెంటఁదానుజొచ్చి॥ 180

గీ॥ క్రోఁతిమొగమొంటెమెడపుప్పిగొగ్గిపండ్లుఁ। జప్పిముక్కునుమిడి
గ్రుడ్లుదొప్పచెవులు। వెడదనడుమునునిడుఁగూనిపీఁపుఁగలిగి। పరఁ
గునాకాలకౌశికుపడఁతిగాంచి॥ 181

క॥ ఆపాఊతబెడిదంబగు। రూపునకున్ బెగ్గిలించిరుటమఱెవ్వైతా।
నేపగిదినేనినయ్యను। ప్రాపున్ గనవొదిఁగి మొక్కుప్రక్కనునిలు
వన్॥ 182

గీ॥ ఇంతలోఁగాలకౌశికునీసడించి। కలఁగియాగేస్తురాలగుకలహకం
టి। యెపుడువోయినపోకయీవిప్పుడింటి। కరుగుదెంచితిక్కకింత
యఘుకలేక॥ 183

క॥ ఔసరె! నాయానతిచే। కీసరినొక మెఱుఁగులాడినింటికిఁగొని॥
రా। మీసరమాయిదిగోనీ।పోసరమడఁగింతుననుచుమూతులువాడి
చెన్॥ 184

చ॥ పొడిచిపిసాళియచ్చెలియ, ప్రోవఁగదేయనిచేతులొగ్గివేఁ।
డెడుతనపెన్నిటన్ మొనసిడీకొనిపెత్తనమేటికింతయు।
కఱడనయినన్ బొకాలిమఱిగాతికిగింజలుదేకతెత్తెయి।
ప్పడుచునటంచుమీఱిసిగపట్లకునెత్తినజంకిపొఱుఁడున్॥ 185

గీ॥ ఈవలావలనొదుఁగుచునింతినీకుఁ। గరముఁజేఁదోడువాదోడువర
వుగాఁగ। దెచ్చితి. నిఁకొండుతెఱఁగుగఁదెలిసికొనకు।మన, మ
ఱింతయునలిగియయ్యతివ రేఁగి॥ 186

మ॥ బళిరా! కాఁపురమేటఁబుచ్చిబ్రతుకున్ బాటింపకిమ్మాడిఱరె।
చ్చెలనొకొఱర్తుకనాకుబానిసిపనిన్ జేయంగఁదెమ్మంచునేఁ।
గలలోనైననునీకుఁదెల్పితినె, రొకఱంబెంతపోకార్చితో,।
వలదంచెంతగఁజెప్పినన్ విడువవీవయ్యెంపుఁజెయ్దంబులన్ 187

మ॥ అనితాఁబెన్నిటిమూతులంబొడిచియారాయెంతహెచ్చిల్లితే।
మనుకొందించెద, నీమొగంబునను మొద్దుల్ వెట్టి, మాటాడకిం।
కనటంచాఱడివుచ్చిపైఁజఱవఁబోఁగా, ఁగాంచివల్దంచుఁజ।
య్యనవప్పాఱుతనాఁచిచంద్రమతియమ్మాయానెయికఱర్జముల్॥ 188

క॥ అగడిదిపదుగురువిన్నన్।నగుదురుకడుఁజవ్వపాలునలుగురిలోనన్।
దగదిద్దిసిగ్గుచేటులు। మొగపొనరించెదనుమగనిమోదకుతల్లీ।189

క॥ ఏనీకుఁజెప్పఁగలిగిన। దాననెమాబొంట్లకెల్లతగవెఱిఁగితిపం। గా
నేర్పుప్రోడవెంతయు। జాణవునీకెఱుఁగరానిచందముగలదే190

చ॥ పెనిమిటినివ్విధిఁగినిసిపేర్మిదొలంగఁగఁదూలనాడివా।
దునకుఁగడంగిపైఁజనుటదుండతికంబదిగాదుచేడెకున్।
జెనకియొకప్డుతాఁదగవుసేడ్పుడఁదప్పినఁదిద్దుకొంచునో।
య్యనఁదగుమాడ్కిఁబాడిదెలియన్నడువందగునెందునింతికిన్॥
191

గీ॥ మగనికెదురెత్తిమాటాడఁదగునటమ్మ। వెలఁదికనయమ్ముఁదనపా
లి వేల్పటంచు। ఁదలఁపువారేఁతలనుగూర్మి వెలయఁగొలిచి। ప
రఁగుటదియిందునందునఁబదవితనకు॥ 192

సీ॥ కొలసంద్రమునుదాఁటఁగెలనఁజిక్కినకలంబతివకుఁబెనిమిటియం
దుఁగూర్మి। కోరికలీడేర్చుకొను వేల్పు వెలిగిడ్డియతివకుఁబెనిమిటి
యందుఁగూర్మి। మొదలగనుదోఁచుముంగిటిపెనులిబ్బియతివకుఁ
బెనిమిటియందుఁగూర్మి। పొలుపారుతమిబత్తిబత్తిముత్తైలప్రోవ
యతివకుఁబెనిమిటియందుఁగూర్మి। అనయమార్తిలిఁబెనిమిటియం
దుఁగూర్మి। గలిగినదైవాఱుపున్నెంపుగరితకింక। నేలనోములుపా
సంబులేలజన్నె। లేలబతములుగ్రుంకుడులేలతల్లి॥ 193

క॥ అనితానీలువుతెఱఁగుల। విని వినరాకాసివోలె వేఁడిమిచూడిన్।
గనికలహాకంటిమిగులన్। బనుకుచునోదివ్వాలాడిపాడిఁదెలిపెదే॥
194

చ॥ ఎవతెవెనోరుమూసికొనకీవొకక్రొత్తడివోలెనిల్చి, నన్।
దెవడినయంబుచొప్పెఱుఁగదెల్పెదు, నన్నరయంగనీకునున్।
జవకఁగఁదోఁచెనే, పొలువజాణెత, కూయకుమింకఁజీపురన్।
జవిరెదనోసియంతరువుచందమెఱుంగకమాటలాడుదే॥ 195

చ॥ తగవునుదీర్పుమంచునినుఁదద్దయునిందెవరేనివేఁడిరే।
తెగుబడిసొత్తువోసినినుదెచ్చినదిందునకాపిసాళి? యీ।

తగులమటుంచి గోటుడిగి దండుగుఁ దిండి మెసంగ కింకవా।
సిగ మెయి వంచి యింటఁబని సేయుము పెత్తనమేల నీకిటన్॥ 196

శా॥ ఈ వానన్నునెఱుంగ వెంతయు, మగండే పొందినాకివ్వేడన్।
జేవిప్పుల్ పొనరించుటారసితివో సీ, మ్రోలమాఱొడ్డినా।
కీపీటన్ మగనాంద్రుమాంచు రెకడున్ హేరాములన్ దోరకే।
వేవన్ బూతములైన బిట్టలుకు నా పేర్వన్నని వేమిఁకన్॥ 197

చ॥ అనుడు కరంబుఁ జంద్రమతియళ్కుచునియ్యవకింక నేవితం।
బునమగ నాలిపాడి తెఱవుల్ వినఁ దెల్పఁగ నౌనటంచుఁ దాఁ।
బనులనొనర్చి యాఁగ కిలిపాముసకున్ బలిపుట్ట నీనియ।
ప్పినుఁగుఁదనంపు బాపనితఁ బేరిమిఁ గొల్చుచు బీతినిచ్చలున్॥ 198

సీ॥ తెల్లవాఱక లేచి యిల్లు వాకిలి యూడ్చి ప్రాఁచిపనుల్ దీర్చి బావికేగి।
గ్రుంకివల్వలు గుంజుకొని నీరు గొని తెచ్చి యాలుడి వండియయ్యాలు
మగల। కిడి యోగిరంబింత బుడతకుఁ గుడిపింప మిగిలిన సరె లేక మె
లఁగి నిద్రఁ। దలియ యాకులు గుట్టి పాలముపట్ల నురోసి పరఁటలు గొని
రేయి పొరట మగుడ॥ వండి వడ్డించి యాపాలు వాగుగూర్చ।
వొందు దనుకను వారి కొల్వుననుమెలఁగి। వచ్చి దనపట్టి నిదురవో
ఁబుచ్చి యంత। నేమికను మూయునోకొంత యోడము తాను 199

క॥ వెతగుడిచి చంద్రమతియి। ప్వితమున బానిస మొనర్చి వెగచుట యున్
బా। ఱుతకలహాకంటి గొదవలు। వెతసు చుసిలుగులచు జింత వేఁపు
చు నెంతేన్॥ 200

క॥ కొట్టినఁ దిట్టినఁ బడియటఁ। గట్టిఁడి కట్టడుల మెలఁగి కాఱియవడు
చున్ గుట్టుమెయి నొదిఁగియుండిరి। పట్టియుఁ దానున్ గడెంగి పదప
డి తేఁడున్॥ 201

గీ॥ చంద్రమతిలోహితాస్యుల జట్టి పసిఁడి। నొరసిల్లక విడుగునకొప్ప
గించి। యరిగెదవె నేఁడు జడదారి యప్పుడీవు। నను డుతహాతహాప
డి తేఁనినరసినవ్వి॥ 202

మ॥ బళిరా! నీవిపుడిడ్డ పైకమది నేవొరంగ నీ వెంటఁగొం।
దలమందన్ బడి వచ్చినంతనకు నాత్మంబయ్యేఁ గాదని నే।
సిలుగుల్ దూఁకొని వత్తు నే, రవడి నా చేఁజేర్పు, నే వచ్చియేఁ।
దులుఁ బూండ్లాయెనటన్న నవ్వుడుగు వేడ్కన్ గూర్చి తేఁడంతటన్॥
203

మ॥ మును నా వెంబడి నిన్నుఁబంచు నెడ నా మోనంపు విన్నాణిగ్ర।
కురిఁజనన ప్పెల్లయుఁ దీర్చి పుచ్చుమని నాకున్ జెప్పె, నీ బత్తెమి।
మ్మని చెప్పండు, నయంబు వోవిడిచి యేలా మాటికిమ్మాడిరిఁజ।
న్సైనయన్ దార్చెదు నన్ను మిన్నకయ నాకిమ్మంచుఁ గైజీతమున్॥
240

గీ॥ ఐన నెందు బత్తెము డుగుటగలదు, రూ। కలను రెండో మూఁడొ కలిగి
నటుల। నిచ్చుటయును గలదు, పెచ్చుగ నిటు వేల। కొలఁది పైకమి
డుటగలదె? యనుడు॥ 205

శా॥ ఈవున్ గన్గొనుచుండ గాధికొమరుండెంతేఁ దమిన్నాఁడునన్।
రావోయీ యని చీరి యేకతమునన్ రాఁదీసి నిన్ జూపి సా।
త్రీవజ్జీరుఁడొసంగుఁ దేఁజనుము, నీకీతండె నానాఁటికిన్।
ద్రోవన్ జీతము నిచ్చుఁ దానన డెవాదుల్ పూని యిట్లాడెదో॥206

శా॥ నే నీ వెంబడి వచ్చి వేత్రితగవున్ నేజేయుక్రొన్నితమున్।
నా శెంపున్ మడుఁగుల్ నెఱా చదువులున్ నా నేర్పు తొల్విద్దెలున్।
మోనేంపున్ సమకోలుసందెలుఁదబంబుల్ నేలపాలయ్యె, నే।
మీ, నీకై నిటు వెల్లవిడుకొని నే నే తేరనీబంట నే?॥ 207

శా॥ ఎండల్ వానలు నాకవాడివగుడైయే పాటినీ వెన్నడిన్।
కొండల్ గోనలు మెట్టి, వంకలును వాఁగుల్ దాఁటి, పేరాఁకటన్।
దిండింగానకయెన్నిపాట్లొవడియే తేరంగ, నీనేఁడుడ।
బ్బుండకిట్లుంచుకోనంబురే! తుదకుబేల్బుచ్చంగనిట్లాడు దే॥ 208

ఉ॥ ఈవిటులింతలోమఱచితే, మది నేఁటికినీకుఁదోఁచు? నే।
నావగపార్చిలోమఱచిననే మఱపొందదు డెందమయ్యో! యా।
దేవరగుళ్ళఁగొట్టములఁదిన్నెలఁదీవులనింగ్లపంచలన్।
వావిరినొండిలిన్ దవిలివచ్చినదంతయునీను వెన్నడిన్॥ 209

క॥ నీతోడఁగూడియివ్వగ। జీతమునాతంబులేక సేగులఁబడినా। నీత
ములువదిలిక్రుస్మర। నాతలవ్రాలాంబలారె? నాయంబిదియే?॥ 210

శా॥ పనిన్నాళ్ళుసయించియయ్యో!యనినీ హేరాములన్ జూచియాఁ।
గానీ, నేఁటికోఈపోయిచ్చెదవురోకట్టంబంచునిజ్జాలిచేఁ।
బోనీయంగదయిట్లువలిట్టితివి, బోమున్ దార్చిజకిట్టంపని।
న్నానాఁడేయిటఁబెట్టిపొమ్మనిన మేలైయుండియుండుంగదా॥ 211

సీ॥ ఇకట్టులఁగుకిట్టపస్తులఁజికిట్టతోవఁ। దూలినీకు నేఁ జేసిన మేలు
తుదకు। వేమునకుఁబోయుపాలయ్యేఁగా! మఈమి। సెప్పుదునట
న్న ఈఁడునచ్చెరువువడుచు॥ 212

సీ॥ నీవునీయొజ్జలగుగాధినిసువునాన। నప్పగండఁగనా వెంటనరుగు
దెంచి। తిపి, కతంబేమినీకుబత్తెంబొసంగ। నిచ్చవోడమిననిత్తుఁ
గాకేలబోము॥ 213

మ॥ సరవిన్ నీ వెను వెంటవచ్చి, మెసవన్ జానొప్ప మేల్వంటకం।
బరుడైయుండుటటుండఁబండుకొనఁబాడౌగుళ్ళఁజావళ్ళు నా।
కిరవయ్యెన్ గదయంచునన్న నెదవోయీ, యప్పిగాకబ్బునే।
పసునొప్పన్ దెరువర్లకోవరులుఁబూఁబాన్పుల్ తివాసీలఁనున్॥ 214

గీ॥ అనవుడబ్బినసిగముఱియబ్బకున్నఁ। గాళ్ళనఁగసన్నునిన్నాళ్ళుఁగ
రముఁబెరిమ। గడలుకొనఁదెచ్చియీనాఁడుగడచినట్లు। పలికెద
వునీవదెంతటిములుచవనుచు॥ 215

గీ॥ మీఱివడుగఁడువలుకబాజాఱువీది। నరుగువారందఱిదియేమియా
గడంపు। వైనమరయుఁడు “కూలికివచ్చిపాలి। కడుఁగుటిది” గద
యనుచుండనొడయడపుడు॥ 216

మ॥ నను నేలాపరుసంబులాడెదవు, క్రన్నన్ నన్నుసున్నింపు, చే।
సినతప్పుల్ గలవెన్నియేనినిటనీచే నేఁడు నేనొప్పగిం।
చినసొమ్మూజడదారియప్పునకువాసిన్ గొమ్ము, నీసంబళం।
బును నెందేనిగడించియిచ్చిమఱి ఈపోమాపొనిన్బంచెదన్॥ 217

మ॥ అనుడున్ బాలుఁడునవ్వి వెంగలినె, యొయ్యందొల్తనా చేతఁజి।
క్కినరొక్కంబిటనీదునక్క అను నెగ్గింపంగమున్నిచ్చి నే।
వెనుకన్ దేవురిలంగఁ, గావలసినన్ వేంద్రంపునీకత్తిఁజ।
య్యనవ్రద్దెంచిపసిండిఁగైకొనుముసొత్తుం దాఁక నేసీనన్॥ 218

గీ॥ “హరిహరీ” యెట్టిబెట్టిదమాబెడంద। నుడువువినఁగల్గె నాకునివ్వ
డువువలన। ననుచుఁగటకటఁబడియనరందియేమి। సేయునదిలేక
యాఱడిఁజిక్కియపుడు॥ 219

క॥ ఓవడుగయేటికివ్వాహి। దావంతంబొదవనీఱతాఁబలువలుకన్। నీ
విపుడుకోరినట్టులె। యీవిడిముడిఁగొనుమిఁకేమియేనొనరింతున్ 220

గీ॥ అనవుడుప్పొంగి ఈఁడనాయమునకిపుడు। వచ్చితివిగాధిపట్టిసొమ్ము
చ్చిపనుపు। తడవొనర్చినఁదానేమిదొడరియనునొ। యాతఁడుం
దునసాజంపుటలుకతబిసి॥ 221

క॥ ఎనుబోతుపైనజడిగొ। ట్టినవగనేమనకయటమటించితివిన్నా। ళ్ళ
ను, మదకిచ్చితిబత్తెం। బొనకూర్చుటలెన్నినాళ్ళకోయిఁకనప్పున్
222

చ॥ అనవుడుతేఁడుపలుకు నిపుడప్పునకైననబోణినమ్మవ।
చ్చినపయికంబుబత్తెమనిచేకొనితింకగడించికాదెయీ।
కొనినపసిండినీవలయు, గోఁజుచుసారెకువాలయించితె।
మ్మననెటనుండితెత్తు, ఁదడవాఁగుమొసంగెదనన్నఁబోఁడున్॥
223

గీ॥ లగ్గుబళియినుముఁగూటిచి। యగ్గికిఁబెట్లనెడిమాడ్కి ననయమునీకై।
వెగ్గలపుఁదబిసితిట్టుల। గ్రుగ్గన్ దటియయ్యెనింకమన్నియనాకున్।
224

గీ॥ ఇట్టినెపములుగలవెన్నియేనిబలుకఁ। జెప్పకవినాకువినివినిచెవులు
తూంట్లువడియెఁ, దొలినుండినిన్నునేనడిగియడిగి। నోరుగాయ
గాచెనుదలయేరువట్టె॥ 225

క॥ మొగమోడతేఁడనీవిఁదగుసొమ్మిటఁబెట్టితొలఁగుతడయక, నీకేఁ।
బగవాఁడనైనఁగాని। మ్మిఁగనీసాకులనోకింతయేవిననునుడున్॥226

ఉ॥ ఆఁచకనాఁడెరాచటికమంతయొసంగితి, నాలుబిడ్డలన్।
డాఁచకనేఁడునమ్మినదినారినిబోసితి, జాలియేరికిన్।
దోఁచఁగఁగట్టుఁబుట్టములతోనిటనిల్చితి, నింకనేటికిన్।
ట్లేఁచెదు, నన్నునమ్ముకొనుమీ, నుడిపల్దొరయప్పదీఁగఁగన్॥ 227

గీ॥ అనవుడదిగదానాకునునను వెరవు। నురవనితలంచితేన్నికేల్గొడి
సిరమ్ము। విలిచెదనటంచువాడవాడలనుద్రిప్పి। వీటనెల్లరువిననిట్లు
చాటఁదొడఁగె॥ 228

సీ॥ ఈరేడుదీవులనెల్లఁగట్టడిఁబాడిఁబోఁడిమినేలినఱేఁడితఁడు। పుడ
మినంతయుగాధిబోదకుఁదేగంపు వాసిగనిచ్చినవాఁడితఁడు। ఎ
క్కటిఁద్రైపాఖురక్కసినడుకానవడి వ్రక్కలించినవాఁడితఁడు।
ఎట్టియిక్కట్టులనేనినొక్కింతయు వాతప్పఁబొరయనివాఁడితఁ
డు॥ పుడమివేలుపులారపేరొడయలార। కలిమిబేహారులారయో
కాఁపులార। బానసీనిగనమ్మెదవీని నేఁడు। వలసినఁగొనుండు నేఁ
గోరువిలువయొసఁగి॥ 229

క॥ అనివాఁక్రుచ్చుడుఁగడు వెరఁ। గునవెల్లర దేమటంచుగుమిగొనికను
చున్। మనమెచ్చటయీఱేనిన్। గొనుటెచ్చటయనుచునటమగు
డఁగావడుగున్॥ 230

గీ॥ ఱేనిఁగనియేలనినుగొనఁబూన రెవరు। నీడ, నేతెంచుమిఁకమాల
వాడనేని। విలువచిక్కిననేరికేఁదోలఁతునిన్ను। ననుచుఁజనుడువి
శ్వామిత్రుడంతమున్న॥ 231

చ॥ తనమతబంపుబత్తిఁదురితంబుగనయ్యెడఁగాటినొండువి।
న్ననువునఁగల్గఁజేసియటనమ్మికమైఁదనట్టుదీరుపన్।
బనుపరినుంపమిత్తిఁదలఁపన్ వెసవచ్చియతండుబత్తిమైఁ।
బనివినమ్రమొక్కిమ్రోలనిలువంబడనజ్జడదారియిట్లనున్॥ 232

క॥ నీవునుమునువినియుందువు। కావాయలవేల్పుఱేనికట్టెమటను
నేఁ। జేవమెయిహరిశ్చంద్రుని। చేవాతప్పండువొరయఁజేసెద
ననుటల్॥ 233

ఉ॥ దానికిఁగాబవంతములఁదార్చితి, నేల్పడికత్తిఁబాపితిన్,।
గానలకీడ్చితిన్ వెతలఁగందనలంచితి, నప్పుమోపితిన్।
బూనిపడ్డంతికిన్ దనకుఁబొందెడసేసితివెండిమియేట్లన్।
దానొకయింతయేఁబలికితప్పఁడ దేమిబతంబొపంతమో॥ 234

గీ॥ అలవసిష్ఠునిపద్దెటఁగలిపిపేరు। వడసెగనటంచుఁదలఁచిన, వడ్డి
యాస। మొదలుచెఱచెనన్నట్లునా మొదటిపలుకు। ప్రతినకేచేటు
నేఁడుపాల్పడఁగనయ్యె॥ 235

ఉ॥ నన్నుగుఱించినీవిపుడునానుడిఁజేకొనియీవిలాతినా।
పన్నినకాటిగాఁపవయిపంతముమైనలతేనివిల్చియొ।
న్నెన్నియొబన్నముల్ గుడిపియేఁచినఁగానినిజంబుబింకమున్॥
సన్నగిలంగువాఁడనహసాదనివిచ్చుమొగంబునన్ వడిన్॥ 236

గీ॥ వాలకంబుననాకాశివల్లకాటి। పారుపత్తెంబుగొనివీరబాహుఁడ
నఁగఁ। బేరువడిహరిశ్చంద్రువజీరురాక। వార్చుచుజముండుతేని
పోవడనెఱింగి॥ 237

సీ॥ కండెనకొకవింతకఱవన్నెఁదేఁగల్లు మొగమునజేగుఱుబొట్లునుని
చి। తలకుఁజుట్టినపచ్చిపొలవల్పుచిఱుపేలికలతోడఁ గుఱువెండ్రు
కలనుజెక్కి। వాఱంటఁగాఁగొంగవాలిడిపెనఁచిననడికాసెచుం
గులునిడుపువిడిచి। మదురువానఁగఁగాఱుమైచాఱలకునీఁగమూఁ
గఁజాలనిపాఁతమొలబిగించి। కోరమీసలనులివెట్టికొనుచుఁబొల
సుఁ। గల్లులొట్టియుఁగైకొనిప్రల్లదములు। కెత్తివెడపాటఁబాడు
చునెదురుఁదన్నుఁ। గానకెంతయుమత్తునఁగదలియపుడు॥ 238

గీ॥ పాడిపోఁడిమిదప్పనివాఁడితండు। పరికడనేనిలెంకనైచేరితగిన।
పనియొనర్పఁగనైదాఁచుకొనఁడితండు। వీనిఁగొనరయ్యనమ్మెద
వెలకటంచు॥ 239

క॥ మొలదట్టిఁబట్టిమెణకరి। చలమరియైరమ్మటంచుజడ్డిగమునముం।
గలకీడ్వనించుకేమదిఁ। గలఁగకయేతెంచుతేనిగని త్రాసువెసన్॥
240

సీ॥ దమ్ముఁడీ నేఁడు నా చేతఁ దగులువడియె। గాధికొమరునిపద్దు నెగ్గంగఁ
జేయ। ననువు వడెనంచుఁ జింతలనవలికివలి। కడుగుద్రొక్కుచుని
క్కుచువడుగునరసి॥ 241

క॥ పడిగాపై నాయింటన్। బడియుండఁగ వీనివిలిచి పడ సెద వెలయ।
ర్పడఁ దెలుపు బేరములతో। నెడ సేయకుమనిన వడుగఁడిట్లనె వే
డ్కన్॥ 242

క॥ ఏనుంగుమీఁద నిలఁబడి। మానిసి రవమీటు సోడఫుమట్టుపసిండిన్।
జేనొసఁగి వీనిఁ గైకొను। మేనిచ్చెద ననిన నద్దియెంతని నగుచున్ 243

శా॥ ఆలున్ బిడ్డలు లేరు, వీనికొకయూరా! కానమూరూరుఁదా।
నోలిన్ ద్రిమ్మరు వాఁడు, నొంటరియు నాకోసం వియం బయ్యె,ముం।
దేలిన్ నాళ్లొకకొన్ని వచ్చితుదఁదా నే రేయినజ్ఞాఋను నో।
యేలా గీతనినమ్మి విల్వఁదగుఁ బోనీ, వీనికీవీయెడన్॥ 244

క॥ ఫూఁటవడ నేరి నేనీ। వీటన్ జూపింపు నమ్మివిలిచెదననరా। పోటరిఁ
గనివడుగఁడునీ। వేటికి నమ్మంగఁ బలుకవిదితగవను నే॥ 245

గీ॥ రాకరాక వచ్చినది బేరంబు నేఁడు। తొలఁగఁద్రోయక వెరవగు పలు
కులాడి। వడినొడంబడుమీ మాల వానికనిన। గరమునవ్వుచు నగ్గొడ
గరిని జూచి॥ 246

ఉ॥ ఏను ద్రిశంకుపట్టి విను మీవిగ గాధియనుంగుఁ జూలికిన్।
నా నెఱి నేలనిచ్చితొలి నచ్చినజన్నపుటప్పుఁ దీర్పఁగాఁ।
జానఁగొమారు నమ్మియదిసాలమి నమ్ముడువోము నింతకున్।
నే నెవరైన నేమి మదినింపునఁగొల్చెద నేలువారినిన్॥ 247

సీ॥ తండ్రియొఱకువ, ననుగన్నతల్లినికఱ్ఱ। మాలు తాలిమి, కొడుకు పేరడ
ఁకువయును,। పాడిసైదోడు,దిట వెపెందోడు గాఁగఁ। బరఁగు నేనిం
కనెట్టులొంటరిని? యనుడు॥ 248

క॥ ఎంగఱిఁగనుఁగొనసీవలెఁ। బొందుగనీతంబులాడిపొరఁజూపితు
రన్। సందుగనిజాఱిచనుపని। పందలవందలకొలందిఁబలుమఱుఁ
బుడమిన్॥ 249

చ॥ అదియునుగాకనీయునికివారయ, ఁగోమలికంబుడంబుచేఁ।
బొమపునుగాంచియుంటఁదెలుపున్, మఱినాకడఁజేరిరోయకం।
గదలకునోర్చియేపగిదిఁగర్జములన్ మెయివంచిచేయనో।
పుమవిట, లావణంబునకుమున్నెయెఱింగినమంచిదవ్వలన్॥ 250

గీ॥ పనికిసోమరిపోతవైపరఁగ, నీదు। సలితమునవాకుమరలునేపిలువ
రోయి। యింతగాదంతగాదిప్పడిచ్చటరియఁ। బసిఁడిఁజదలంటఁ
బోయఁగావలదెయనుడు॥ 251

ఉ॥ ఓఁడనునవ్వుచున్, ననుగుఱించినిజంబుగనమ్ము, వానలున్।
లోడిగనాడు, నీముదలలోఁగకచెప్పినకర్జమేదియేన్।
బాడినెఱింగిపోఁడిమినొనర్చెద, మాటలవాఁడఁగాను,న।
న్గాడుమునీవమెచ్చెదవుచొప్పడనాపనిపేర్మికింతకున్॥ 252

చ॥ మఱచిననానతిన్, ఒనికిమ్రాలిన, ఁబెట్టిదసంచుఁజకర్టిన్।
వెఱచిన, ఁగర్జమున్ సలుపవీడిన, నోడినెపంబులాడినన్,।
బఱచినఁ, బందమైసురిగిపాసిన, నీబెడిదంపుఁగైదువన్।
గఱకఱవాతలన్ దఱిగికట్టడనీకడకాళ్ళఁజెట్టుదున్॥ 253

గీ॥ అనవుడమ్మాలయంతలోనటమటించి। యేడదెచ్చెనొజాలెలఁబైఁ
డిఁబోసి। వడుగునకునిచ్చిఱేనిఁదాఁబడసెనప్పు। డరుదుపడిచూడ
మింటిత్రోవరులుఁగరము॥ 254

క॥ వడుగంతటవొడయనిగని। కడువడినీతలఁపువెలయఁగలిమిన్ బలి
మిన్। బడసెదవీవనిదీవన। లిడిగాధికొమారుఁడున్నయెడకున్
255

— –॥

క॥ అనిమూర్ఛం డేయుఁడుచు। కఱనిమాటలవిన్నమానికపుమనుమ
నికిన్। వినిచిననవ్వాలికతయున్। వినిపింపుమటంచుఁదన్ను వేవేఁ
డుటయున్॥ 256

శా॥ మట్టున్ మీఱిజగంబునింటరముల న్నట్టించివిన్నాణిరా।
దిట్టల్ వట్టినవేత్రిపట్లఁజెఅపన్ ద్రెకొట్టిచిట్టల్ గడున్।
బుట్టన్ జెట్టలుదొట్టమిట్టుతొలి వేల్పుండట్టగిట్టింపఁగా।
దట్టంబైకనుపట్టుపట్టియముఁజేతన్ దాల్చు పెన్వేలుపా॥ 257

క॥ నెలదారి కైలకోరి। పొలుపారుబిటారి వేసపున్ దునెదారీ। కలిమి
మిటారివటారీ। బలువిడుపున్ దారి వేడబంపుఁగిలారీ॥ 258

తరళ॥ తలఁకుక్రీడికి బాసమైయరదంబుఁదోలిన నేర్పరీ।
మొలకలెత్తెడి వేడబంబులముజ్జగంబులమూర్పరీ।
సొలయకొజ్జలకానఁ గాతనిచూలిమంచినపోటరీ।
మెలమికత్తిసతంబుబత్తులకిచ్చువేలుపుమేటరీ॥ 259

గద్య॥ ఇదిశ్రీనీలకంఠేశ్వరాభిధ పరమేశ్వరవరప్రసాదసంభూతసక
లకలాకుశలకులాల కులపారావారకళానిధిమండల మండ
నాయమానోర్వీమండలాఖండసత్కీర్తివిభవ మండితగుండ
యశ్రేష్ఠినామార్యకులసంజాత శ్రీమద్వైష్ణవసిద్ధాంతోద్ధార
కార్ధంకితిరుమలతాతాచార్యవర్యశిష్యప్రశిష్యవట్టివేళ్ళగోత్రో
ద్భవ అయ్యనకోటతిరుమలశ్రేష్ఠితనూభవ ఆంగ్లేయభైషజ్య
కర్మచాతురీధౌరేయ సరసకవితానికాయ విద్వజ్జనవిధేయ
పార్థసారథిశ్రేష్ఠినామధేయ ప్రణీతంబైనశుద్ధాంధ్ర నిర్వచ
నకావ్యంబును సత్యవిజయనామాంకితంబునునగు హరిశ్చం
ద్రోపాఖ్యానంబునందు చతుర్థాశ్వాసము.

శ్రీ

## —* పంచమాశ్వాసము. *—

। సిరి వెలఁది వలఁతి యెంచున్। నెరసిన వేల్పనుచుఁ దండ్రి నేరమిఁ దర
పన్। బోరనుడువు సోఁకుఁ బోఁడనిఁ। గరిగాఁగంబమునఁ బుట్టి కాచి
న జెట్టీ॥ 1

॥ విను వాఁకయలలర వళికిఁ। బనుపడు క్రొన్నెలుఁగు నుడులపన్నిక వె
లయన్। విని చెమ్మృకండు నికోడుకి। య్యనువున నాగొంతిచూలిక
వ్వలికతయున్॥ 2

.॥ అటుల మోసంపుటాసాదియవ్వాజీగు। విలిచి, కొనుమనితన చేతిపా
లసుఁబులుసు। మదురువుపనంటిగదు రింతగదురనొసఁగి। వెంటఁ
దెమ్మన తేఁడు వెన్నం టెఁగంటె॥ 3

క॥ ఎగ్గనితలఁపఁడు మదిలో। నెగ్గంతయునందఁ జేవఁ జెందఁడొకింతే
సిగ్గొందఁడు బాపురే! తన। యగ్గలపున్ నిజము ప్రతినయది యెట్టి
దొకో॥ 4

మ॥ సిరిమున్నోల్పడె, నాలనంబుఁ దోలఁచెన్, సీమాటనిన్ విల్చి చె।
చ్చెరఁ బట్టిన్ వెనుబుచ్చె, గట్టువడిగా సిన్ గాశి నేఁడొకఁడాగూ।
బరికిన్ దానును మేనునమ్ముకొనియేవంబైన కర్జంబులన్।
దిరుగన్ మేకొనెఁగాని యూఁకొనఁడొకింతేఁ బొల్లు నేజాడలన్।5

క॥ వెడలి హరిశ్చంద్రుండటు। గొడగరిముదలన్ మెలంగి క్రోలఁగఁ దా
నే। కడఁబెట్టుమన్నఁగల్లా। కడనిడి యెత్తుకొను చవలఁగడు వడిఁజ
నుచున్॥ 6

సీ॥ పచ్చినెత్తురువాఱు పసరంపునంజుడులాఱఁగట్టిన జంపువాఱు
ద్రాళ్ళు। ఇడియిందిగసికలకీడ్చి చాఁగఁగ నేల నెండింపఁబఱచిన
యెద్దుతోళ్ళు। ఎఱచియొల్చినబోరయెమ్ములుఁ బుఱ్ఱియ లేదింపఁను
నిఁగిన గేదెకాళ్ళు। గోఱజంబెడసిపోఁగుగనిడ్డగుండెకండెనకాయ
దొమ్మలు నెనడువాళ్ళు। ముడుసులెడనెడఁగలములకడపు దడపుఁ। దో
లుమురియలకొండొంటి తోడఁబోరు। మొఱసడంబులుఁగఱకుట్ల
కొఱగుగ్రద్ద। బోరువలఱంతుగలుగు గొడారిపెండ॥ 7

గీ॥ పిఱితివియకద్దికడుపులోఁ బ్రేవులెల్ల। వాతికే తేరఁ జేయు వివ్వచ్చ
మయ్యె। సైఁచియమ్మురిత్రోవ గోసంగినంటి। కొంకకటవానియి
ల్లొచ్చి కొలువుసుదిరి॥ 8

చ॥ తెగుబడికీరు వెత్తుకొని త్రిప్పుటలో, చచ్చినయూరియెడ్లనూ।
దిగలనుగూడి మోసికొని తెచ్చుటలో, వీటను గస్తుపోవుటలో,।
నగరున వెట్టిసేయుటలో, నమ్మినబంటయి వీరబాహు రేఁ।
బగలనకోలగించి నెఱపఁగ దగు కర్జములెల్లఁ జేయుచున్॥ 9

ఉ॥ వెండియునొండు రేయిముఱి వేసట దోఁపఁబరుండి తన్ను మా।
లండొకఁగాళ్ళ బట్టుమన, లంపటవోవఁగ నజ్జలొత్తుచున్।
దొండొరుగాక యుంటఁగని తోరమున కఱజ మొందిమూరిఱన।
ట్లుండిమనీనిదీమసపు టునిఱఁదలంపునఁ సల్పి బాపురే॥ 10

ఉ॥ పస్తులఁజికఱఁడేకఱటిపాట్లకుఁ జొన్నినఁ జొచ్చుఁగాని తాఁ।
గస్తివడంబులొచ్చనఁడు కాదనిరోయఁడు ఖిన్నుఁబోఁడు పై।
బిస్తఁదలఁపఁడా దవిడిప్రేలఁడు తూలఁడు నాఁడునాఁటికిన్।
సిస్తుసెలంగి నా పనుపుఁ జెట్టలబెట్టిమఁడవ్వొ నెంతయున్॥ 11

గీ॥ తమకపడి గాధికొమరుండు తాను జెడ్డ। కోఁతి వనమెల్లఁ జెఱిచె నాఁ
గొదరి తాను। జెడునదియుఁగాక నన్నును జెఱుపఁదలఁచి। పంచెఁ
గాకున్న వీని నోడించు బెట్లు॥ 12

ఉ॥ పటికిఁ దాననుందలఁచె, నెట్లొ తలంచెను బోతొలంగకే।
నేటికి వచ్చితిన్, ముదల నేర్పడవచ్చితిఁ బోకడంగితా।
నేటికిఁ బంచె, నిట్టిపని కెంచకపంచెను బోమెఱుంగకే।
నేటికి రానొడంబడితి, నెవ్వహి నాతని పద్దు దీర్చుటల్॥ 13

ఉ॥ మంచిది గాధిపట్టి నుడి మానక వీనిని గాటనుండఁబం।
పించెద, లేని బీతిగుడిపించెద, గాములతోడుపాటు జెం।
దించెద, రేఁబగళ్ళనరునించెద, నొంచెద, ఁజేతనైనదాఁ।
కెంచెద వంచనల్, పిదప నింతకునోర్చిన నేమిసేయుదున్॥ 14

క॥ అనితలఁచియపుడె తా మే। లొఱనినటులన్ను సలిలేచి కూర్చొని
మ్రోలన్। దనకాళ్ళొత్తెడు తేసిన్। గనుఁగొని యిట్లానతిచ్చెగా
రము దోఁపన్॥ 15

మ॥ మదిని న్మెచ్చితి నమ్మితిన్ గరము, నామాటొప్ప నివ్వీటికా।
టినరిన్ గాపయి వీరదాసుఁడనవ్రిల్లంగఁ బేరంది, బె।
ట్టిద మొప్పన్ మును గాటిసుంకమును బాటిన్ దండి, పీనుంగుకై।
పొదఁబేర్పన్ నెలవిమ్ము, పొమ్ము, నిలువచ్చోఁ గొమ్ము నాచేగుదెన్॥ 16

క॥ అనితన చేగుదెనొసఁగినఁ। బనివిని యానడికి రే యిఁబ్రాఁబడుది
ట్టం। బున్నఁగదిలి యూరివలకడ। గనువచ్చితు పాసి వెళ్ళఁగు గదురఁ
గ నెమటన్॥ 17

సీ॥ కటికచీఁకటికితోఁ డ్రాఁగమిక్కుటముగాఁ ద్రుష్కుఁద్రొంబొగరాజి
కనలుసొదలు। సొదలఁగాలికరంబునుడిగొనినరముల బిగినీర్లిలేచె
డిపీనుఁగులును। పీనుంగలనుగాఁటి పెలుచఁజయ్యనమంటలనుబొ
ట్లుగాఁబడు నెనడుజిడ్డు। నెనడుజిడ్డుఅచి మెక్కినపొతరంబుననఱ
చెడికొఅవిదయ్యములతఱుచు।తఱుచుబొఱియలఁదోఁడెడువఱడు
పిండు। తీండ్రగుండ్రలుగొలుపుకోటంద్రదండు। గండుసోఁకుపిసా
సులు మెండు నెండు! వఱలఁజూడక్కి వెఱగొల్పువల్లకాడు॥ 18

గీ॥ తలఁకకటఁజొచ్చి, కడునిట్టతాటిపగిది। నుండునొకసోఁకుఁదడవి
యెవండవీవు।తలఁపనా చేతఁబడినవేతాళుఁబోలు। పోఁడిమియుఁ
బోలికలుఁగన్నవాఁడవనుడు॥ 19

మ॥ అనరుల్లంబునఁగాఁడఁగన్గొనుచునయ్యాతొల్తసీచేతఁజ।
చ్చినవేతాళునితమ్ముఁడన్ వెడఁగునై చేతాఁకునన్ గొంతనే।
నునుసీతోననినీఁగిపాఱికడకింపన్ సోఁకు పెన్మ్రాఁకున్।
ఛణినై నిల్చితినయ్యన్నుయిఁచు వేతాళుండునా పేరునున్॥ 20

మ॥ అనుడున్ జంకకురోరియియ్యెడకు నేఁరైనింకఁబీనుంగుఁదె।
చ్చినమోమోడకకాటిసుంకమును జేసేవారి చేదండివె।
నక్కనిటన్ గాల్పనొప్పూడ్పనో నెలవొసంగన్ వీరబాహుండున।
న్పనిచెన్ జూచితెమచ్చమీగుదియ, చేవన్ దాల్పనాకిచ్చెఁదాన్। 21

ఉ॥ కావుననీవునున్ గడమగాములు నెల్లరు నేఁటినుండి నే।
నేవహిఁనానదెట్టుదునొ యేమఱకట్లు మెలంగికర్జముల్।
వావిరిఁజేయుటొప్పు, నిఁకవాయపుఁబోకలుసాగిఁరావుముం।
దేవలనొప్పఁజెప్పితిసుమీ, పఱిమార్చెదఁబ్రాలుమాలినన్॥ 22

క॥ నావుడు బుద్ధి" యొఱింగితి। దేవర యానతి మెలంగి త్రిమ్మరి పను
లన్। గావింతు మున్ను మీ చే। నోవడి బడితప్పు మంటి నను డువుట
యున్॥ 23

మ॥ సరె నాకియ్యెడఁ గాచియుంచుటకు నోజన్ మీ అనీవిప్పుడీ।
దరి నెత్తౌతమగంబు వేగనొకటిన్ దాపించుమన్నన్ వెసన్।
బరువౌ బండలు వాఁడు దెచ్చి యిడియప్పైపన్నుఁ జౌకంబుగా।
విరిపిన్ బోసి మెదించి మంచియను గావింపంగ ఱేఁడవ్వలన్॥ 24

ఉ॥ దానిపయిన్ మెలంగినలు కెట్లు గనుంగొను చెవ్వరెప్పుడేన్।
బీను గుఁడెచ్చి రేనిఁగని పేరెమునన్ జనికాచి సుంకమున్।
బోనియకందియ వ్వెనుకఁ బూడుపొ కాలుపొ చేయనిచ్చు చా।
పాణసి ఱేనిఁ దాఁ గొలిచి పాయక కాటిని నిల్చి యెంతయున్॥ 25

గీ॥ తలఁకకొడ లెల్లఁ గన్నులు లిగికూరు। టుడిగి తెలగంటికలిమిఁ
దానుండఁ నసను। గలుగనుండెడు తెలుగంటి గద్దెపదవి। చిన్నెలవి
మున్నెకనుబడవు నెన్న, ఱేఁడ॥ 26

గీ॥ అప్పుడటఁ జంద్రమతి దానుహంస నారి। పేరఁ బరఁగుచుఁ జిన్నికొ
మారుతోడఁ। గాల కౌశికు విరిబోఁడి కలహకంటి। తమకిమ్మై పెట్టు
కట్టుదిట్టముల మెలఁగి॥ 27

సీ॥ కాలఁ జూపించిన కర్జంబులను జేతఁ జేయుచు వనట మైఁ జిక్కి పొక్కి
తనకూర్మి పెనిమిటియునికిఁ దాఁ దెలియమిఁ గంటికిఁ బుట్టెఁడు గాఁ
గనేడ్చి। యొడకింతయో రెంబువడయమిఁ గొడుకుఁ దానాఁకట్టిక్రం
గదనడలి భడలి। మురిపెంబు మెయిఁ బెంచి ముద్దాడ వలసిన తనపట్టి
వెతఁ గూర్చి తలఁగి కలఁగి॥ యొట్టకేలకుఁ దన వ్రాఁతె యిట్టిదనుచు।

నెంచి మఱచి తన్నుఁ బొగడించుకొనుచు। నొకనాఁడొక యేఁ
డుగా నొకఁడు యేఁడు। గడపుటయుఁ గాంచియుఁ గాలకౌశికుండు॥ 28

మ॥ ఒకనాఁ డాపయి లోహితుం గదిరి రానోజం దగం బిల్చియుం।
జికదోఁపం జిఱుబుగ్గలం జులిమి గాసిల్లంగ నున్నాఁకటిం।
నికటం బొప్పఁగఁ బట్టి యీడ్చి యవురా నీ యీడు వారందఱో।
కొఱకఁ జెద్దియుం బొనరింపఁగా మొసవి నీవో యింటఁ గూర్చుండుటల్ 29

మ॥ తెక తేరం దిని యెన్ని నాళ్ళిటులఁ బ్రోదిం గాంతు వట్లొప్పదీ।
విఁక పైవస్తులతోడ నెల్లపుడు దోయిం గట్టి వేఁబోకఁద।
ప్పక యెందేఁజని పుల్లలాకులు నుదబ్బల్ వేళ్ళికట్టెల్ తొలం।
గక తెమ్మంచు నదల్పనాఁడవుడు పీఁకం జెందివాపోవుచుం॥ 30

చ॥ చనియపుడింటఁ బ్రాఁచి పనిఁ జక్కఁటి దీర్చి డుఃఖినింగనుం।
గొని తను గాలకౌశికుఁడు గొట్టిన వైనము దెల్లదెప్పినం।
బనవికరంబు సారె దనపైఁట చెఱంగునఁ బట్టికన్నుదో।
యినిదడి యొత్తి యొత్తుకొని యెత్తె శునంగదనంగలార్చుచుం॥ 31

చ॥ నిను, బసిపాప, లేనిసువు, నేరిమిఁ దేఱని చిన్నపోఱనిం,।
గనుఁగొని కాలకౌశికుఁడు కట్టడిఁ బెట్టి కడింది చెద్దు బొ।
స్మనఁదనవోరె టాడె, నకటా నిను నేనియుసంబు నేసియు।
న్గనుఁగొనకున్న నోర్వ, నికఁ గానవు నిన్నెటుఁ బుత్తునన్నరో॥ 32

మ॥ చికటూరిం గయి సేసి మేననగలుం జిన్నారిఁ గైకొల్పి, కొం।
కక తేజీపయి నుంచి లెంకలిరువంకల్ గొల్వ మునీంద్రుఁడరా.
నికరాఁ శానసి వాఁబువోవు పదవిం నేటించి రాకల్మికిం।
ఆకొనం గాంచిన నీవు నేఁటికొక పాటుం గొల్వఁ బాయైతివే॥ 33

గీ॥ అనయము స్త్రీనిఁ గలుములనలరు పదవి। నోలయు గరితనఁ బుట్టక యొరు
ల పెట్టు। పోఁతలకు లోఁగు పోర విపుట్టువంది। పోఁడిమి నడంగు నా
కేల పుట్టితయ్య॥ 34

చ॥ అని వెత వేఁడి వెచ్చ మది నాఁగక యుబ్బుచు నంతకంతకున్।
బనుపడు వంతఁ గ్రుక్కుఁ గొనఁ బట్టిరొ యింతకుఁ బాలు నానతిన్।
బని వినకుండఁ గాదతని పన్పిన రించుట పాడి, తండ్రి, యం।
చనువుగ బుజ్జగించి తనయుకుఁ దనఁ జేర్చికొ మారు బాళి నై। 35

ఉ॥ కాలియపిండు నుండియును గండుఁబులుంగుల దండు నుండి తో।
ర్వేలుపు దాడి నుండియడవిన్ గల దండి మెకాల నుండియొం।
డాలరి మూఁక నుండి చెడు గందని యట్టుల నెల్ల వేల్పులన్।
దాలి షేఁ జేపట్టి చెయిఁ దా మొత గూయుక ట్టి యాడటన్॥ 36

ఉ॥ తోరము జాలువాఱ నుదోయిఁ దోరంగెడఁ టి బొట్లుఁ దా।
సారె చెలంగు నెమ్మడి విచక్కటి ముద్దడి మోము మోమునన్।
జేరిచి యన్న గోసరఁ జెట్లుఁ గొలంకులు గట్లుఁ బుట్టలున్।
సాకు వలున్ డలంచి యొటజం కెద వోపవిలంబు నాయనా॥ 37

క॥ అనిహాటీయు గొమరు నడవికి। ననుపఁగ మది రాక చేతులాడక తం
డ్రి। యనిపుల పొంచుచుఁ గాననఁ। జనుతడుపుం దార్ల వెంట జాతప
ఱచితమిన్॥ 38

గీ॥ అన్నలాగపీనినని పెదమీ వెంటఁ। దోడుకొనుచు నేగి తోడి తెండు।
మున్ను నెన్నఁ డడవి తెన్నెఱంగినవాఁడు। గాఁడు నేఁడు గ్రొత్తక
రము మెచుక॥ 39

క॥ అనిపనిచి, తరలు కొమరుని। వెనుజను, దనినిలచు, నదిగొ వెడలె
డునని ముగ్గనుఁగొను, మరలును, మఱిమఱి। వెనుదిరిగికనున్, గ
ర్వంబు వెనుగొను, మగుడున్॥ 40

గీ॥ మగిడికనుచూపు దనుకకో మారుఁ గాంచుఁ। గాంచియంతంత పొడ
మాసకలను జూచుఁ। జూచికంటికిదవ్వైన నంత వేచు। వేచి సైఁచ
నితమి వేఁడి వేఁగు నేఁగు॥ 41

గీ॥ ఇటుల నా హంసనారి తా నింటికరిగి। పనులొనర్చుచు నపుడప్పు తన
కుఁదోఁచు। చెడుగుఁ జిన్నెలఁ గనియేమి చెడ్డపొసఁగ। నున్నదో యం
చుఁ బొగులుచు నుండె నపుడు॥ 42

క॥ పనిగొనికను కనియును సుదిఁ। గనరనరును బెనఁగొనంగఁ గౌశికుఁ
డాలో। న నెవినుకలికంటి వలం। తినిదక్షుకుఁ బిలువనంపి తీవసమె
నయన్॥ 43

క॥ మును పావేలుపు దొరకో। ల్వునను హరిశ్చంద్రు బొంకుఁ బొరయిం
పవసి। ప్తురితోడఁ బ్రతిన చేకొని। పానరి చితిన్ వెతలు వాఁడు బొం
కండెంమన్॥ 44

ఉ॥ ఆఁచితిరాసిరుల్, మఱియు నాఁడఁ బెట్టఁగ నైనవారిఁ ద్రే।
రేచితి నాలుఁ దానెడయ రేచితి, లోఁచితి, లొచ్చుఁ జెయ్యులన్।
వేఁచితి, నేఁచితిన్, దడవు వేచితి, జూచితి, నుల్లమూఁచితిన్।
గ్రాఁచితి, మాయురే! తనదు కట్టడియెట్టిదొ, బొంకఁడేమిటన్॥45

చ॥ పలికినలాగొనర్పుమిని బైనుకదప్పు టెగాక మోనపున్।
వలఁతులు నల్వురం దుఁదల వంపులు నన్ నగుబాటు చేటునన్।
గలుగును, నన్నుఁ గావలసి కాఁదగుఁ జెట్టల నాకు బాసనై।
నిలబడి నేఁడు నా ప్రతిన నెక్కొ-నఁ జేయఁగ నీకుఁ బోలదే॥ 46

క॥ నీవాకొండల నేనినె। జావేంద్రపు విసము సెగల బంపి తెగినుపే। రా
వడికో బలఁ గ్రాఁచం। గావలఁతివి. పెఱల దెంతకలఁచఁగ నీకున్॥

క॥ పనివినెద వేనిఁ జెప్పెద। వినుము, హరిశ్చంద్రు వెలఁది వెతని పుడమీ।
టను గాలకౌశికునియిం। టను వర వైకలహాకంటితవతవకిరవై॥ 48

గీ॥ ఊడిగంబులొనర్చుచునుండియుంటి। పుడమి వేల్పానతీ వేళ్లిపుడక
పోవు। పానికతుంగలఁ దెమ్మని తనకొమారు। జన్నిగట్టులజతఁబం
చియున్నదిపుడు॥ 49

చ॥ కనుకయిదే మొదంబునుమి, గ్రక్కున నీపిపుడేరికీయెడన్।
గనుపడ కేగి కాననొకకట్టనొ పుట్టనొ డాఁగి లోహితా।
స్యుని గెడపంగ మాకొనుము, చొప్పటివ్వెపిని వానితండ్రిపై।
న్ననబి గుపిఁగి తానుబ్రతినన్ విడిపట్టుఁదొలంగుఁదక్షకా॥ 50

మ॥ అనినన్ దక్షకుఁడంతవల్లెయని యొయ్యన్ బాసి తామస్సుగో।
వణపున్ దాల్పులువోవు తెన్నెఱఁగియవ్వే పేగియందొక్క డన్।
బొనుఁగున్ గంమువనస్త్రిఁ గాంచియటవైపున్ జూచి యాచెట్టుక్రిం।
దను బుట్టన్ గనిలోహితున్ గఱచు చేఁతన్ సెల్చె నప్పట్టునన్॥ 51

శా॥ ఆలో వెల్వడి పాఱుబొట్టియలతో డైలోహితాస్యుండు మై।
దూలన్, హజ్జలు గంద, మేనఁ జెమటల్ దోతేరఁగా, గూకటుల్।
వ్రేలన్, మాటికి నూరుపుల్ నెగయ, డప్పిన్ డస్సి, యోలంబులన్।
సోలింతల్ వడ నిల్చుచున్ బడలికన్ జూఁకించుచీఁటిరునన్॥ 52

సీ॥ పుంతల గనిమలఁ బొలములఁ బడి పిల్ల కాలువలను మెట్ట చేలు దాఁటి।
వడ దేఱునటు మగ్గి గుడినొండుఁ గనియందుఁ దడవాఁగి చని కాలిదారిఁ
జీలి। ఒలుకులకొకయింతవలకడ తెరువందిపాలి మేరగడచి దాపొ
లముఁద ఱిసి। గుబురులౌ పొదలును గుట్టలు జలజలను లివ్వాడినో డెడు
న్నాట సెలలు॥ నేలకందెడు కొమ్మల గ్రాలు చెట్లు। పానికతుంగలు

తల్లును బోదపట్టు। నరవలును బుట్టలోలముల్ గరువుగట్టు। నాకు
లలనులుఁగలుగు పట్టడపిఁజొచ్చి॥ 53

చ॥ వసుగుల దేమొ కౌశికుని వాలక మోసుటి వేల్పు సేఁతయో।
నిజపని యేఁడు తక్షకుఁడు నిల్చిన చోటిక యేగి నాత్రిలిన్।
బోడగని యందు నాకులను బుల్లులఁ గోయుదమంచు నయ్యెడన్।
విడిసిరి, లోహితాస్యుఁడును వెన్బడి త్రోవయలంత్రమాలుచున్ 54

గీ॥ అచటఁ గెంపుగోలఁపునొండరసిదాసి। దగసనఁగసీరొకించుక
త్రాపనగడి। నాత్రి మొదలునఁదల మోపి పిమఱ వినిమర। వోవుట
యు లేపివడుగులు వోముతానిన॥ 55

చ॥ పొనికను వ్రేల్మికట్టియలుఁ బుల్లలు వారలు సేకరించిప।
మ్మినడదిమూచి తాఁబడయుమున్ దసి నాకులనాత్రికొమ్మలన్।
గనుఁగొనినికి యంపకోనఁగానటఁ దక్షకుఁడుండుపుట్టపైఁ।
దనకుఁడి కాలు నూఁదకయిదండనొకించుక యొత్తెన త్తరిన్॥ 56

శా॥ పుట్టన్ వేచిన తక్షకుండపుడు నిప్పుల్ గ్రక్కు బల్ క్రోవ్వండపున్।
నిట్టూర్పుల్ నిగుడన్ మరీనఁబడగన్ నిత్రించి లేకొట్టుచున్।
గట్టలన్ బుసకొట్టి క్రొవ్విసపు నాలుకల్ దేర్చి క్రేఁగోలలన్।
చుట్టున్ బెట్టఁగ లోహితున్ గఱచె, నహ్మాయంచు నప్పాపఁడున్॥
57

గీ॥ కాటువడిపో లెనాత్రియుఁగా లెఁగాని। త్రాఁచుపనివినివచ్చియా
రాచపట్టి। నన్నిగొనఁజాలదయ్యెమున్ దన్నునటుకుఁ। బనుచునె
డఁదల్లియెట్టిదివనలని డెనో॥ 58

క॥ వెఱచఱవియపుసు మెఁఱకరు। లఱుతన్ బెను విల్వ లోహితాస్యు
ని బెలుచన్। గఱచుటయున్ సుగ్రైయ। స్మృతిపొడవడఁగుటయుఁ
గాంచిమరలెడుపూనిన్॥ 59

మ॥ అలరాపట్టిఁ గలంచి యచ్చెరువు గాదా! త్రాఁచు కాటందియున్।
బాలివోఁ జల్లు విసంబుఁ దిన్న నెలదాల్పున్ బోలి యుక్కఱం తతా।
సోలసెన్ గాని మ ఈమి గాఁడరయుఁడీ సొంపిల్లు నైకెంపుఁ జా।
యలు వో వజ్రలు గాజు వాఱవు మొగంబా వాడు దోఁకం తయున్। 60

ఉ॥ ఆయత పాటు జేసి మది నాఁగని జాలిఁ గొమారుపీనిము।
నాఁయన హంస నారి యిటు కన్పచు నేమని కాఁపు గొల్పనీ।
తాయత రెట్టఁ గట్టి దొ తప్పక తాఁకిన త్రాఁచు కాటుఁ దా।
వాయము వ్పుచ్చి తోంటి చెలువంబునఁ గ్రాలెడు పీనిఁ గంటిరే॥ 61

గీ॥ ఇప్పుడొల్లవో యొఁ డెప్పు రిల్లనా కింత। తడవు వట్టు పీని తల్లి కేలు గ।
పఱపనురవు మనకు మాఱి నాలసింపఁగ। నడను గాఁదటంచు మదిఁదల
లంచి॥ 62

క॥ కడువడి నిండ్లను మగుడుచుఁ। దొడిఁబడ మఱపెడల నొకటఁ దొలిను
దులుగవు। ల్పైడలఁగ మిడియలఁ బలుకుచు। నెడనెడ లోహితుని
చందమెన్నుచుఁ ద్రోవన్॥ 63

సీ॥ ఇంత సేపటికి లోహితుఁడు దాఁగఁ ఖడేరు, ఁగఖ చేరి మనల కై కాంచె
నేమొ। కాంచి తా నొంటరి గానున్న కతమునఁ గళవళపడి వెఱఁగం
దెనేమొ। వెఱఁగంది యింటికి మఱలుచో నెలుఁగమి దడబడి తాదా
రిఁ దప్పెనేమొ। తప్పి వేఱొండు క్రంతను జీలి మఱి పునకట్టంపుట
డవిఁ దాఁ దరిసెనేమొ॥ యింత కాపాము విసమెక్కఁ గంతుకొనె
నొ। యేమొకో, వానిమన వెంట నెడపక నిచి। తోడి తెండనె సయ్య
స్మతోడ నిప్పు। డేమనుచుఁ జెప్పఁ గగునంచు నేగ వేగ॥ 64

చ॥ వడుగలు పీఠికిన్ మఱలి వచ్చిరె, క్రుంకెడుఁ బ్రొద్దు, మాపిలున్।
దొడుకులు వచ్చె, రాఁడిఁకను, మాపిలి స్రుక్కెనొ త్రోవఁ జిక్కెనో।

కొడుకనిమాటికిఁ దెలిపికొంచెపడఁ దలసాలనంది, లో।
నడఁగని తాల్మిఁ జంద్రమతియప్పుడుకన్గొనుచుండియంతలో॥ 65

సీ॥ మసకలైకనదవ్వుపొసఁగ నేర్పడరానిపొడవుల వడుగులపొడ
పుఁదలఁచుఁదలఁచికన్నార్పు మేరలఁగొంతవోడకట్టు మెణకల్గఁగని
వత్తురనుచు నెంచు। నెంచియంతంతకు నే తెంచువారలఁ బసఁగఁ
గన్గొనితనపట్టికరయు। అరసిడగ్గఱు మూఁకఁబోరిఁ గొమారుఁడు లే
మి వెనుజికెరలనోయంచు వెతఁగలంగుఁ। గలఁగి డాసినవడుగులఁ
గాంచితండ్రు। లారలోహితుఁడేఁడనియడుగవడుగు। లదవడలు
వోపు మనుగుండెలవియ వాని। యునికిఁ దెలఁగును జెప్పనయ్యో
యటంచు॥ 66

గీ॥ వెఱఁగుఁబాటున మొనటికినఱుకఁబడిన। యరఁటివహినిట్టనిలువు
నకొరగి నేల। పోలివ్రాలివితాకందిసుంతదెలసి। హాకొమారాయ
టంచుఁ బేరాడఁబనవి॥ 67

క॥ నేలందడవుచు ప్రాఁకుచు। వాలుంగనుదోయినీరువఱదగొనఁ
లో। జాలిమునుంగుచు తేలుచు। హా లెమునన రందిలోహితా
స్యాయనుచుఁ॥ 68

క॥ పడి చేష్పడిబడిఁగళవళ। పడి చిత్తరుబొమ్మవగిదిఁబడినుడిసేతల్।
పిడికొంతవడికి దేరొని। కొడుకా కొడుకాయటంచుఁగుందుచు
ఁదనలోఁ॥ 69

చ॥ పెనిమిటి బాసియున్న వెత పెంపునఁగ్రాఁగియునీకతంబునఁ।
దనివగపార్చియుంటి, దరిదాపికనెవ్వరునాకు, నెవ్వగఁ।
మనుగడఁబుత్త్ర, నేకరణినూనుమనివ్వగ, దండ్రి, నిన్ను నా।
తనకలిపుప్పు ముట్టు నెడఁదద్దఱిమొంతతలంకితోమదిఁ॥ 70

క॥ అనిపలువగలఁ వగలఁ। బనవెడియాహంసనారిఁబదరికరంబుఁ
గనలిపరుసంపుఁజూటులఁ। గనుఁగొనియక్కలహాకంతిగసగు
చుఁబలికెఁ॥ 71

శా॥ నాకా నేర్పెదపీవగల్ రవళికానా! పట్టిమున్నెడకో।
పోకఁదారిచినీవునుఁసురుఁగుచొప్పుఁ వేచిప్రెబొబ్బత్తి, న।
య్యోకుఱ్ఱంబోడపుద్వ్యముక్టెననిననూ్నటింపఁగా నేడ్చుచుఁ।
బోకిళ్ళఁబడునీ తెఱంగెఱుఁగుమఁ బో, యోసితొత్త్రాయిఁకఁ 72

మ॥ పనిపాటెయ్యదిఁజేయకిప్పగిడఁగువ్యాడంబునఁదేఱెనిం।
డినయింటఁమునిమాపునఁ జెడుగువాటిల్లంగవాపోయినఁ।
మనుకొందించెదనోరుమూసికొనియెంమఁబోకనీచెయ్యికేఁ।
జనునూనాకడసాగిరావివి, గరాసా, హంసవారియనఁ॥ 73

చ॥ అనయముఁబోకిఁ, కన్నకడుపౌటఁగొమారుపయిఁదలంపులోఁ
బనుపడియంతకంతకునవారిగవంత నెలర్పఁ, బాఱుతఁ।
గనుఁగొనియాపెకాళ్ళపయిఁగ్రాఁచువెతఁబడియాసటఁనను
గొనకొనికాచినాయడిగికోలునోసంగవెతల్లిమ్రెుకెఁదఁ॥ 74

చ॥ అడవినిబాముకాటువడియక్కటమ్రాలియనుంగుఁబట్టిపెం।
పెడలెడు,ఁదల్లి,యెడవిసమెక్కనో,యొక్కకమున్నెయీడకుఁ।
దడయకవానిఁదేఁబనిచిదక్కగుమందులు మన్పఁబోసినా।
యెడరెడరింపఁగాఁగొమరునిచ్చినపున్నెముఁగట్టుకొమ్మనఁ॥ 75

మ॥ మునునాపెన్మిటివేఁడుత్రైగడనసొమ్ముఁబెట్టిజట్టిఁనినుఁ।
గొనితెచ్చెఁమఱిదానివడ్డికిఁకఁగాన్పుఁమన్పఁగా వెజ్జురాఁ।
బనుపఁజేసెపసిండివెచ్చమునకుఁబ్రాల్మాలకీనేఁడుమం।
దొనరింపఁదగు! బాగు!! చెప్పినివినాకోయెమ్మెలాఁడీ, బళా!!!76

చ॥ వడుగులఁగూడి వేల్మి నెఱపన్ గొనఁదెమ్మనిపంప. వారివె।
న్వడిఁబడి రాకబల్మిడిసి పాటునఁద్రుళ్ళుచునుండఁబట్టక।
ప్పొడవడునీకొమారుఁడటఁబుట్టలగుట్టలఁజెట్టుఁజేమలన్।
బడుకుల నెకర్ నేటికటఁ బ్రాఁకెడుపుర్వులఁజికర్ నేటికిన్॥ 77

గీ॥ అడవిఁబుట్టలఁగోమలనడరుపాప। గమికిమునుము న్నె వాకట్టుఁగ
ట్టమైతి। మదిగదా మే మొనర్చినయట్టితప్పు। తప్పులోఁగొనిమ
న్నింపుతల్లిమమ్ము॥ 78

క॥ అనియుల్లసములనుల్లముఁ। బనికెడుములుకులనుబోలుపలుకులుగదు
రం। జెనకియును నెట్టకేలకుఁ। కనికర మెదఁగొంతదొనుకఁగాని
టువలికెన్॥ 79

చ॥ బ్రతుకనిబిడ్డబారెఁడిఁకఁబల్మరు వానిగుఱించి యేలొకో।
వెతపడెదిట్లుమందొనఁగు వెజ్జిట లేఁడుకొమారుఁజూడఁగా।
మతకరియాసయున్ననొరిమాన్ బను లెల్లనొనర్చి యేమిటన్।
గొతుకులు వెట్టకీవెడలిగొబ్బునఁ బ్రేపునరమ్ముపొమ్మనన్॥ 80

గీ॥ సంజవడదివ్వెలుంచిపసాపడంగఁ। బ్రొద్దునకువండివారిచిబోన
ముంచి। మంచముల వ్రాల్చియయ్యాలుమగలునిదుర। వోవుదనుక
నువరవుడముల మెలంగి॥ 81

చ॥ వనటఁగలంగిచంద్రమతి వైళమపట్టినిఁగాంచుపూనికిన్ దా।
రొక్కనినకడిందిచీఁకటినిగొంకకయన్నిసినొంటిఁ బెన్మిటన్।
దనమదినిల్పి యత్తలఁ పెత్రాణయుఁదోడునుగాఁగలోఁగఁద్రొ।
గిన వెతముంజిదారు లెఱిఁగించిన దారినిబట్టి యేగుచున్॥ 82

గీ॥ పైఁపరానివంతఁజఱియలఁబట్టియ। టంచుఁబిలుచునిలుచుననరుఁ
జెనుచు। సవులఁదవులుమా యురవలినున్నాఁడని। వించుఁగాంచు
ఁబలవరించు నెంచు॥ 83

సీ॥ గుట్టలఁగాలించుఁబుట్టల నాలించుఁబట్టీయటంచులోఁబలవరించు।
పుంతలఁబొడగాంచుఁ బ్రంతలకడఁబొంచు బిడ్డాయటంచురాఁ
బిలువనెంచు। సీమలఁబరికించునేమలదరిసించుఁగన్నతండ్రీయం
చుఁగలవరించు। గరువులఁబఱతెంచుదొరువులకరుదెంచుహాకొ
మారాయంచునాలపించుఁ। దఱిసికనుఁగొన్నచోట్లకుఁదరలిమ
రలు। నెమకునెంచునుగానకనెగులబొగలుఁ। గొడుకయెందేగి తే
యనిగుంయుఁగంయు। నేమిసేయుదునని నేలకెఱఁగియొఱలు॥ 84

క॥ అలుఁగుల వెలుగులఁగలుఁగులఁ। బలుఁగుల నెలుఁగులనుఁజిలువప
లుగులరోయుꣳ। గొలఁకులఁ కెలఁకులనొలుకుల। కలఁకులవలఁకు
లనుడాయుఁగానకయెందుꣳ॥ 85

సీ॥ కరలారనీటిజక్కరలారమీరైనఁజూపరేనాముద్దుపాపనిందు।దరు
లారచెంచుచౌదరులారమీరైన నరయరేనముగన్నయనుఁగునిం
దు। మఱులారరేయిద్రిమ్మరులారమీరైనఁగానరేనామేలికందనిం
దు।గడులారమెకపుసంగడులారమీరైనఁగంటిరేనాకూర్మికాన్పు
నిందు॥ కొమ్మలారనిరాబారికొమ్మలార। మావులారనెఱాగాడ్పు
మావులార। దారులారజగాజడదారులార। పడనున్నాఁడొయె
ఱిఁగింపరేకొమారు॥ 86

సీ॥ పొదలలోనిసుమంతమెదలిననాయనాయని డాసినెమకిలేఁడను
చుమరలు। సెలలనునులివాడుజలజలనాలించితండ్రీయటంచుఁదా
ఁదడవితరలు। చఱులమువ్వాలువెట్టుగుఱకలఁబాటించియన్నాయ
టంచుఁదానరసియొఱలు। కెలనమ్రాఁకులగూండ్లఁబులుఁగులరొద
వినియయ్యాయటంచుఁదానడగితెరలు॥ నంతకంతకుఁబట్టిపైనల
ముమరులు। హెచ్చఁబడిసొమ్మసిలుఁడేఱునిచ్చనెరియు।నుదిలగొను

వేఁడుత్రైచూచునొల్లఁబోవు। ఱిచ్చవడు లేచునిలబడు వెచ్చనూ
ర్చుఁ। బొగులుహోలోహి తాయనిపొక్కిపొరలు॥ 87

సీ॥ కటికలైమీరు నాకన్నతండ్రినడంచివిపిందోనగ్గితిరే మొఱవినుచరేల।
కట్టిఁడులైమీరుపట్టినాపట్టిని దినినారొయదినాకుఁదెలుపరేల। నె
నరుఁబోకార్చియాఁకొ నిమీరునాకూననులిమిమెక్కితిరే మొను
డువరేల। కరకరిమైమీరుగనినాకొమారుని సొరిదిబ్రమింగితిరే మొ
చూపరేల॥ కడిఁదిపసిదిండులారసింగంబులార। మొగపురాగొం
గలారయోముగమొగంబు। ఫులుఁగుగములారమీరునాసిలుగుదొ
లఁగఁజూపరే నేఁడు నాముద్దుఁజూపనిందు॥ 88

క॥ అనితా మొగములగములన్। గనుపులఁగనుములను, మలలగనులన్
దొనలన్। గనుఁగొను నెందున్‌గానక। మునుకొను పేరెడరుఁగడ
లిమునుఁగున్ మునుకున్॥ 89

క॥ మఱియున్ బైకొను నెగులున్। వఱదన్ బడి తెరలఁ దేలివనటకుఁదు
దిగ। ట్రెలుఁగకతొరఁగుచునపుడపు। డెఱకువమఱకువలఁగలఁగి
యిట్లనివనరున్॥ 90

ఉ॥ కానఁగదయ్యనిన్నిపుడు, కట్టిఁడిరాలిదిగాకతల్లియా।
నా! ననునీకడిందియొడకంచినదెంత తెగించెనింక నే।
దీని మొగంబుఁజూడ వెనుదీయకతార్కొనుదోసమంచు, నీ।
లోనఁదలంచియీరములలోయలలోఁగికురింపడాఁగితో॥ 91

ఉ॥ లేక, జగంబులన్ సవతులేనిజగాసిరిఁగన్నరాచక।
న్యాకుననుంగుఁబట్టినయి, నాడిక లేలెడువాఁడనయ్యె, నే।
నీకడనొక్కపాటునికనీకొని లేఁకగనైతినంచునో,।
రాక మొఱంగితింతకనరాయనరాననుగన్నయన్నరో॥ 92

శా॥ అన్నాపున్నమచందమామనగునీయందంపునెమ్మోమునా।
కన్నుల్ చల్లనడంగనెంతొ మెలమిన్గ్రాలంగనుంగొంచుఁబై।
బన్నంబుల్ మదినేర్చనెన్నివడినన్ బాటింపనేనక్కటా।
కున్నానన్నిటుబాసిపోయెదవెనాకున్ బ్రాపుఁబ్రోపేరిఁకన్॥93

ఉ॥ లాయ, నుసింగితింతకనలాయను, నింకనుదోఁపరాదబే।
లాయనులేకడించునరులాయనుగన్నడసేయఁగండ్రిమే।
లాయనునేవరింపనగులాయనునింతటియొల్లఁబోకలే।
లాయనురాచబొట్టియనెలాయనుబాయఁగఁగోర్కెలాయనున్ 94

మ॥ అనుచున్ గ్రంతలవ్రంతలన్ సెలలలోయల్ గాంచితానెందునన్
దనకందన్ బొడగానమిన్ నిగుడువంతన్ దోఁగిమ్రోయుచున్।
జనుచేదోయొకయీరెలుంగువిని యాచాయన్ గనుంగొంచుఁబె।
ల్చనబూతంబులునక్కలున్ గొజలువోజల్ చూచుచందొక్కెడన్ 95

మ॥ కనుమున్ గుట్టకొకింతడాపొలముప్రక్కన్ వాఁకఁదాఁగ్రాణఁగ।
గ్గానిమున్వాష్వాలుదెల్పినట్టియలపుల్గుల్ చూచికన్గంటనం।
డనుజెట్టొక్కటిగాలిబూదియయియుంటన్ డాసియాచెంతనా।
య్యనఁబుట్టన్ గనియాఁడుఁదెర్లువెతమైవాలోహితాయంచుఁదాన్॥ 96

చ॥ అడఁగినమట్టిబూదిపయినజ్జలుమోవఁదలాఁపిపుట్టగా।
నడరనొకింతఱొమ్మపయినజ్జొకయోరకువ్రేలనేలఁజే।
పడియరమోడ్పుకన్గవనెపంబునఁగూర్కినవానికైవడిన్।
బడినకొమారుఁగాంచిపడెఁబట్టుఁదొలంగినబొమ్మచాడ్పునన్॥97

క॥ పడిమైమఱచియొకించుక। వడికిన్ దెలివొందిచిచ్చువడికొమరుని

పైఁ। బడి మోము మోముఁ జేరిచి। తడవుచు నెద మోమకొనుచుఁ
దల్లడపడుచుం॥ 98

చ॥ జడిగొని కంటినీరురలి జాలొలొన నేడ్చుచు వ్రాలి కేల్గవం।
గెడయొనగూర్చి గ్రుచ్చి యొడికిందనకందను జేర్చి మేనము।
న్దడుచుచు నంతకంత వెతదూకొనపొమ్మునిం గిపోలెన।
య్యెడరునఁ గన్నతల్లికడు పెవ్వహినోరిచియుండునకటా॥ 99

క॥ తని తెలిసి మొలుఁగు రాల్పడ। మునకుచుఁ బుడుకుచును గాళ్ళు మొగ
ముం జేతుల్। గని వెచ్చ లేమికయ్యో। యనిపొగులుచుఁ నం డ్రియా
నలడఁగించితి వే॥ 100

క॥ అనిమతి మెయినుసురులుగల। వనిముకుఁ జెరవులను గేలునను వుగ
నిడిక। న్గొని వేచియేటికీవల। వనియాసలు, చనినవారువత్తురెమ
అలం॥ 101

గీ॥ అనికొమారుని పైవ్రాలియాదమ్రాలి। సెరగుసుడిగొనఁబరికించి
సేకరించి। యడఁచినను మాటికుప్పొంగియెడఁదగ్రుంగి। పేర్చియే
ర్చెడువనట మైబిడ్డఁగూర్చి॥ 102

ఉ॥ నాయనుఁగా, తొలంగఁదగు నాయను, నన్నిటుడించి యేగనొ।
నాయనువంత సైఁచఁగల నాయను, నకటట ప్రాపిఁకేదియ।
న్నాయను, వేల్పుఁదోడుపడె నాయను, నొంటరినైతి నయ్యొకు।
న్నాయనునింక నేమనుదు నాయనుఁ బైఁబడి నాయ నాయనుం 103

॥క వడువుల వెనుబడి వేలిమి। పుడకల నేపమున నువచ్చిపొను పడియడ
విం। బడికడకు నెట్టి వెతపా। ల్పడతివి రా! తండ్రి! చిఘువపాలై యొం
టిం॥ 104

క॥ పదినెలలుమోసినినుగ। న్నదినిడుపనిపాలుసేయనా! తుదకక
టా। యదవదనేకోఁజనోములు। మొదలన్నోచితినొయివ్విమూఁ
డకయున్నే॥ 105

ఉ॥ హాయనుఁజూడవేమిబరువాయనుబల్కవదేలకూర్మిప్రో।
వాయనుమోనమూనమురువాయనునన్నలరింపకున్నఁబ్రా।
వాయనునాయలంతవినవాయనునర్మిలిముద్దొసంగలే।
వాయనుగానసీవునిరవాయనునావెతఁదీర్పవాయనున్॥ 106

గీ॥ అన్ననిన్నుఁగన్నదదియొక్కటియగాని। పెంచిగారవించిపెరిమ
ఁజేసి। గోముసోముఁగాంచనోవనైతినివాఁడె। గొంజనైనవెల
యుఁగొంతమేలు॥ 107

సీ॥ పుట్టినప్పుడునిన్నుఁబొడగాంచినిడుమన్నివెలయుదువనిరిజోస్యు
లుకొమార। పొత్తులనుండసీపాలుపెంచిపేరుపెంపులఁగందువనిరి
పెద్దలుకొమార। మువ్వంటులటుపోకమున్నెనిన్నని కొలంబెలరిం
తువనిరిపాటులుకొమార। దోఁగాడునాఁడెసీతులకింపుఁజెలు
వెంచిగఱువయాదనిరి యందఱుఁగొమార॥ అక్కటావారిపలు
కులనైనఁగొంత। పెనుపుఁగనవైతిమనవైతిననదనైతి। నింకనే
మందునిఁకముందునెటులమందు। నన్ననీవంతనెట్లోర్తుఁగన్నతం
డ్రి॥ 108

క॥ హా! నెలకెల్లతేనిగ। నేనినుగాంతునని యుంటినిట్లాయెఁగటా।
తానొకటివలఁపదైవము। దానొక్కటిసేయుననుట దలకొనెని
జమై॥ 109

క॥ పట్టీపట్టములేలన్। బుట్టియునీవిట్టులడవిఁబుట్టలఁబడ్ధుకున్। గుట్ట
ల్లబడనీనుమలన్। గట్టిఁడియలనలువయెట్లుగావ్రాసెనయో 110

మ॥ నెలఱాబంతిబవంతి మేలుమగఱానిద్దంపుఁగీల్బొఁగుటు।
మ్యేలఁద్రాల్గంటులుజోలఁబాడఁగడుహాయిన్ గూరుక్క నీవెట్లుము।
వ్వాలుగోండ్రింపవఱవ్యులార్వ్వ వెఱపున్ బోకార్చ్చియీకాఱుకో।
నలఁదెన్నంటివదెట్టులోర్చ్చనోడలన్నాన్నీకు నేఁడీయెడన్॥ 111

ఉ॥ వానియదల్పులన్ బరువు వాఱుచువచ్చి చెఱంగుఁబట్టియ।
మ్మానను గాలకౌశికుఁడుహావడిఁగాఱియఁబెట్టి వేసువన్।
గానకు నేగి వేల్మికగుకస్టెలఁదెన్మనెనంటివయ్యనా।
తోనిపు డేల చెప్పవదియూలితొడీలితొ బ్రూలిదోరితో॥ 112

సీ॥ పలుగుఱాలెక్కమంపిలనుండియీవిందుఁబలుగుఱాలెక్కమంపి
లితెనేఁడు। మనుఱేండ్రదొరలమన్ననలందఁగలనీవు మనుఱేండ్ర
దొరలమన్ననలుగంటె। వాలమ్ములొద్దఁజేపడఁబ్రోపుగను నీకు వా
లమ్ములొద్దఁజేపడెనె నేఁడు। మరమునజముదాఁడిఁబోరయంగఁబె
నుపొందిమరమునజముదాడఁబోరసితిఫ్రుము॥ వాఁగునడపులఁబెం
పునుబడయఁగల్గి। వాఁగునడపులఁబెంపునుబడసితెపుడు। కడిఁదిరా
కన్మితుడకు నెక్కరణినైనఁ। దనరెనని నేఁడు తనివొందిచనితె
తండ్రి॥ 113

సీ॥ నాయనాయన్ననన్గాయంగఁబరువెత్తి యొలమిముద్దిచ్చువారెవ్వ
రింక। ఎటకేగితన్నఁగౌఁగిటకాగి యాడఁబోయితినంచుఁదెలుపు
వారెవ్వరింక। గిలిగింతపఱచి చెక్కిళ్ళగుంటలు దేరనవ్వినవ్వించు
వారెవ్వరింక। చుంచుమవ్వమనన్నజుణిఁగిదవ్వుల కేగియొలరార
ఁబలుకువా రెవ్వరింక॥ మదుకొనర్పకుమనవినఁబోకుక్క పలుక్క। లె
లయసాగయింపఁజేయువారెవ్వరింక। గురువువాఱుచు నావంత
కొంతయింక। నెలమిననుఁబలక్కరించు వారెవ్వరింక॥ 114

మ॥ అని తాఁ బల్కుచునుండియుం గనుసురేలా, బొందిపొందూడ్చుతే।
యనువంచూని యటంతలోఁ దలఁచి మున్నష్టుంగనన్ గొన్న బాఁ।
పని జూటాడిన దానఁ నౌచుఁ గొలకున్ బాలౌదుఁ గానంచు నెం।
చి నెజిన్ బట్టికి ముందొనర్పఁగలయూ సేఁతల్ కరం బెన్నుచున్॥ 115

చ॥ కనలుచుఁ బేర్చి యక్కులహ కంఠి, కొమారుని చొప్పెఱింగి ప్రే
పునఁ దనురక్షుటం దిలకుఁ బుచ్చెను, దామసమయ్యె, నింతలో।
మునిఁగిన వీనికిం కఁదగు మంబరపున్ బను లెల్లఁ దీర్చి వేఁ।
జనఁదగునంచు లేచి వెసస్సైఁపమిఁ జేడ్పడి వ్రాలి నేలపై॥ 116

గీ॥ పలవరించుచు నొక్కింత యలవరించు। కొనినదిటమునఁ బూని మూఁ
పునఁ గొమారుఁ। బెట్టుకొని లేచి యటఁ గూఁతపట్టు నేలఁ। గసలుసొ
దలుంటఁ జూచి యక్కడికి నపుడు॥ 117

సీ॥ ఉరక హరిశ్చంద్రుమ వరఁకుల నలయించి చెందఁగాఁ గ్రమ్ము కౌశికుని స
డి యొ। చెలి చంద్రమతి చెంమ చెట్టలఁ గని వేల్పుముగుదలు వడు జాలి
ముమ్మరంబొ। చెనసి లోహితుని మాకొనిన తక్షకునింకఁ జలపెట్టఁ
దవులు దోసంబు పెంపొ। పితహరిశంద్రుని వెత నోంపఁ దోడరినయ
లమి త్రినుఱుకువ కలిమి నింపొ। నాఁగఁ జీఁకటి నిండ నానడికి రేయి। న
డలుడడబడస్ట్రూర్పు గడలుకొనఁగ। వెతగరంచఁగఁ గనుదోయి వెల్ల
గొనఁగ। వడవలను దారఁ నడవుచుఁ దరలి ముంచు॥ 118

ఉ॥ త్రోపడి గాములొండొరు లెదురొక్కని పీన్గులఁ దిన్నమత్తులై।
నేపున నార్చు జాపుల విమొల్లెడ ఉంతిలఁ బొంత బొబ్బలన్।
గోపున దోఁడునక్క గుమిగూఁతలు గ్రందిలఁ బుత్తలెందుఁ దెం।
దేపలు గాఁ జెలంగ వెఱదీకొను కాటినిఁ దాసిగాసిమై॥ 119

గీ॥ ఆఁపు గొను రెండు చేతుల మూఁపునుండి। దించి యక్కునఁ జేర్చి తం

